# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | ఆగష్టు 1997 | సంచిక 8

## విషయసూచిక



ప్రింటర్ అండ్ పబ్లిషర్: పి.కె. సూరి — ఎడిటర్: వి.కె. నరసింహన్

శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు, ప్రశాంతినిలయం

సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ (ఒక సంవత్సరమునకే స్వీకరింపబడును)

ఇండియాలో : రూ.30.00

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ రూ.240.00 లేక యు.ఎస్. డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5
సీమెయిల్ రూ. 120.00 యు.ఎస్. డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : కన్వీనర్, శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,
ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515 134

**సాధారణ సమాచారము :** (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములలో వ్రాయవలెను. (2) భారతదేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టుద్వారాగాని చెల్లించవచ్చును. (3) క్రొత్త చందాయో లేక రెన్యూవల్ చందాయో తెలియపరచవలెను. రెన్యూవల్ అయినచో ప్రస్తుతచందా నెంబరు వ్రాయవలెను. (4) రెన్యూవల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందుగా తిరిగి చందా రుసుమును పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టువారి తరఫున శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.

ఫ్యాక్స్ : 0091-8555-87236 87390, గ్రామ్స్ : 'బుక్‌ట్రస్ట్'
టెలిఫోన్ : 87375, ఎస్.టి.డి. 08555 ఐ.ఎస్.డి. కోడ్ : 0091-8555

# గొప్పతనం కాదు, మంచితనం కావాలి

ప్రేమస్వరూపులైన యువతీయువకులారా! భావి ప్రపంచ పౌరులారా! మానవుడు ధనమును కోల్పోయిన యెడల మరల సంపాదించుకోవచ్చు. మిత్రుని కోల్పోయిన యెడల మరొక మిత్రుని సంపాదించుకోవచ్చు. భార్య పోతే మరొక వివాహమాడవచ్చు. భూమిని కోల్పోతే తిరిగి దానిని సంపాదించుకోవచ్చు. కాని శరీరము పోతే తిరిగి సంపాదించుకోలేదు. అనంత జగత్తులో, అఖిల ప్రాణికోటిలో మానవుడు అత్యంత ఉన్నతుడు. ఇట్టి మానవత్వమును కోల్పోయిన ఇంక తిరిగి మనకు లభ్యం కాదు.

ఈ ప్రపంచ సౌభాగ్యము ఈనాటి యువతీయువకుల ప్రవర్తనపై ఆధారపడి యున్నది. యువతీయువకుల ప్రవర్తన ఉత్తమంగా ఉన్నప్పుడే ప్రపంచము ఉత్తమాదర్శమును అనుభవించగలదు. గడచిపోయిన రాత్రి మనం ఎంత గడబిడ చేసినా తిరిగి రాదు. అనంత సాగరంలో పరిపూర్ణంగా లీనమైన యమునా నది ఎంత పిలిచినా వెనుకకు రాదు. బాగుగా నమిలి మ్రింగివేసిన ఫలమును బయటికి తీయాలంటే సాధ్యం కాదు. అదేవిధంగా మానవుడు శరీరమును కోల్పోతే తిరిగి దానిని పొందలేడు. కాని ఈనాటి మానవుడు తన రోజులను మోజులతో గడుపుతున్నాడేగాని ముమ్ముందు ఏమి జరుగనున్నదో గుర్తించలేకపోతున్నాడు. ఏవిధంగానైతే సూర్యుడు తన కిరణముల ద్వారా జలమును ఆవిరి గావించుచున్నాడో అదేవిధంగా రాత్రింబవళ్ళు తన ఆయుః ప్రమాణమును హరించివేయుచున్నవనే సత్యాన్ని గుర్తించలేక పోతున్నాడు. జీవిత మొక పెద్ద గడియారమువంటిది. ఇందులో సంవత్సరములు, నెలలు, దినములు అనే మూడు ముళ్ళు తిరుగుతున్నాయి. అయితే ఈ ముళ్ళు సక్రమంగా తిరుగుతున్నాయని మానవుడు ఆనందిస్తున్నాడేగాని దానితోపాటు తన ఆయుఃప్రమాణము కూడా తరిగిపోతున్నదనే సత్యాన్ని గుర్తు చేస్తున్న ఘణఘణమనే గంటల మ్రోతను వినిపించుకోవడం లేదు. కాలము తీరక పూర్వమే కర్తవ్యాన్ని గుర్తించి వర్తించాలి.

### మతి, గతి, స్థితి, సంపత్తుల సద్వినియోగం

మానవునియందు పశుత్వము, మానవత్వము రెండూ విలీనమై యున్నవి. భగవంతుడు ప్రసాదించిన తను మన ధనములను సద్వినియోగపర్చుకొనక దుర్వ్యసనములకు లోనై, దురభ్యాసములకు బానిసై కామక్రోధలోభ మోహమద మాత్సర్యములలో మునిగి జీవించడం పశుత్వం యొక్క లక్షణం. అట్లుగాక భగవంతుడు ప్రసాదించిన మతిని, స్థితిని, గతిని, సంపత్తిని సద్వినియోగపర్చుకొని, సద్గుణములను పోషించుకొని, ధర్మమార్గములో జీవితాన్ని గడపటం మానవత్వం యొక్క లక్షణం. ఇట్టి మానవత్వాన్ని మాధవత్వంగా కూడా మార్చుకోవడానికి అవకాశమున్నది.

ప్రపంచంలోని సమస్త పదార్థములను మానవుడు సద్వినియోగపర్చుకోవాలి. కత్తి ఉన్నదంటే దానితో కూరలు తరిగి వంట వండుకోవచ్చు, ఫలమును కోసి ఆనందంగా భుజించవచ్చు. కాని అదే కత్తితో ఎదుటివాని గొంతుకోసి రాక్షసత్వాన్ని కూడా ప్రదర్శించవచ్చు. దీనికి కారణం కత్తి కాదు, మానవుని మతియే! మతిని బట్టే గతి, గతిని బట్టి స్థితి, స్థితిని బట్టి సంపత్తి. ఈనాటి మానవుడు సంపత్తి నిమిత్తమై ప్రాకులాడుతున్నాడేగాని, తన మతిని సరియైన స్థితిలో పెట్టుకోవడం లేదు.

### "యద్భావం తద్భవతి"

మన భావము లెట్టివో మన ప్రవర్తన కూడా అట్టిద్దిగానే ఉంటుంది. న్యూస్‌పేపర్‌కు సహజంగా సుగంధముకాని, దుర్గంధముకాని ఉండదు. కాని ఆ పేపర్‌లో మల్లెపూలను పొట్లం కట్టినప్పుడు వాటి వాసన దానికి కూడా చేరుతుంది; పకోడాలను పొట్లం కట్టినప్పుడు అది పకోడావాసన వస్తుంది; అదే పేపరులో ఎండుచేపలను పొట్లం కట్టినప్పుడు వాటి దుర్గంధము దానికి•

చేరుతుంది. మన హృదయం కూడా ఎట్టి సుగంధముగాని, దుర్గంధముగాని లేని న్యూస్ పేపర్‌వంటిదే. ఇందులో ఎలాంటి భావములను ప్రవేశపెడతామో వాటి యొక్క ప్రభావమే హృదయంపై పడుతుంది. సంకల్పమనే బీజమును నాటి కర్మ అనే ఫలమును పొందుతున్నాము. కర్మ అనే బీజమును నాటి అభ్యాసమనే ఫలమును పొందుతున్నాము. అభ్యాసమనే బీజమును నాటి శీలమనే ఫలమును పొందుతున్నాము. శీలమనే బీజము నుండి అదృష్టమనే ఫలం లభిస్తుంది.

ప్రపంచము యొక్క మంచిచెడ్డలన్నీ మానవుని ప్రవర్తనపై ఆధారపడియున్నవి. ఈనాడు జగత్తు ఎందు చూసినా దుఃఖముతో, అశాంతితో, భయముతో అల్లకల్లోలంగా కనిపిస్తున్నది. ఇట్టి దుస్థితికి మూలకారణ మేమిటి? ప్రపంచంలో ఉత్తమ గుణవంతులైన స్త్రీపురుషులు లేకపోవడమే. దేశమును రక్షించడానికి అస్త్రశస్త్రములుగాని, ఆటమ్ బాంబులుగాని అవసరం లేదు. శీలవంతులైన స్త్రీపురుషులు అత్యవసరం.

*''పాపభీతి లేని పామరత్వము బట్టి*
*దైవప్రీతి లేని దాని బట్టి*
*మానవత్వ మణగె మానవులందున*
*విశ్వశాంతి కిదియె విప్లవంబు''*

పాపభీతి, దైవప్రీతి, సంఘనీతి కోల్పోయిన తరువాత ఇంక మనకు శాంతి ఏరీతిగా లభ్యమవుతుంది? సంఘములోనే పుట్టాము, సంఘములోనే పెరిగాము, సంఘము నుండియే అనేక విద్యలు నేర్చుకున్నాము. సంఘము నుండి ఇంత ఉపకారము పొందినందుకు కృతజ్ఞతగా మనం సంఘమునకు ఏరీతిగా ఉపయోగపడగలమనే విచారణ ఎవరైనా చేస్తున్నారా? యువతీయువకులు నిర్మల చిత్తముతో సమాజమునకు నిస్స్వార్థసేవ చేయాలి. ఇదే సమాజమునకు అందించవలసిన కృతజ్ఞత. దీనిని పురస్కరించుకొనియే సత్యసాయి సంస్థల ద్వారా సమాజసేవ అనేది ప్రారంభించాము. ఈనాడు జగత్తులో నిస్స్వార్థసేవ చేసేవారు కరువయ్యారు. సేవ ద్వారా పేరుప్రతిష్ఠలు పొందడానికి ప్రయత్నిస్తున్నారేగాని అంకితభావంతో సేవ చేసేవారు ఎక్కడా కనిపించటం లేదు. ''శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'' సమాజమునకు అంకితమయ్యే నిమిత్తమే శరీరము ఏర్పడినది.

ఈనాడు అధికారులందుగాని, వ్యాపారులందుగాని, పాలకులందుగాని, రాజకీయనాయకులందుగాని సరియైన త్యాగభావము కనిపించడంలేదు. అన్ని రంగములూ స్వార్థముతో కలుషితమైపోయాయి. విద్యకు తగిన వినయవిధేయతలు, తెలివితేటలకు తగిన త్యాగభావము, అధికారానికి తగిన ఆచరణ ఈనాడు అత్యవసరం. ముఖ్యంగా మనం దైవప్రీతిని, పాపభీతిని పెంచుకోవాలి. దైవాన్ని ప్రేమిస్తే జగత్తునే ప్రేమించినవార మవుతాము. ఈనాడు ప్రపంచమంతా ఒకే కుటుంబంగా మారిపోవాలి. అందరూ భగవంతుని బిడ్డలే! ఈ ఏకత్వాన్ని గుర్తించినప్పుడు మనం ఇతరులను బాధించము. దంతములు మెత్తని నాలుకను కరచినప్పుడు దంతముల నేమైనా శిక్షిస్తున్నామా? శిక్షించము. ఎందుకంటే నాలుక మనదే, దంతములూ మనవే! అదేవిధంగా మనలను బాధించినవారిని కూడా మనం క్షమించడానికి ప్రయత్నించాలి. యువకులకు క్షమాగుణం అత్యవసరం. ఈ వయస్సులో ఉడుకురక్తము ప్రవహిస్తుంటుంది, ఎవరేమన్నా చాల కోపం వస్తుంది. ఇది చాల తప్పు.

### భయపడకూడదు, భయపెట్టకూడదు

ప్రేమస్వరూపులారా! కామక్రోధలోభమోహ మద మాత్సర్యములు మృగలక్షణములేగాని మానవలక్షణములు కాదు. భయపెట్టేది మృగము, భయపడేది పశువు. మీరు మృగములు కాదు, పశువులు కాదు. కనుక మీరు భయపెట్టకూడదు, భయపడకూడదు. ఈ రెండింటికీ అతీతమైన మానవులుగా మీరు జీవించాలి. పాపమునకు భయపడాలి, దైవమును ప్రేమించాలి. లోకములో తల్లిప్రేమ ఉన్నది. తండ్రిప్రేమ ఉన్నది, సోదరప్రేమ ఉన్నది, మిత్రప్రేమ ఉన్నది. కాని వీటన్నింటిలో అంతో ఇంతో స్వార్థము ఇమిడియున్నది. ఎట్టి స్వార్థమూ లేని ప్రేమ దైవప్రేమ ఒక్కటే. దైవము మీనుండి ఏమీ ఆశించడు. అతనిలో పాదము మొదలుకొని తలవరకు అంతా నిస్స్వార్థమే! పరిపూర్ణప్రేమయే! ఇట్టి ప్రేమస్వరూపుడైన భగవంతుని మీరు కూడా ప్రేమించాలి. దైవప్రీతి రావాలంటే పాపభీతిని పెంచుకోవాలి. పాపమంటే ఏమిటి? ''పరోపకారః పుణ్యాయ

పాపాయ పరపీడనం'' పరోపకారములో పర, ఉప, కర అనే మూడు పదములున్నాయి. పర - అనగా దైవత్వం, ఉప - అనగా సమీపము, కర - అనగా చేయడం. అనగా దైవత్వానికి సమీపంగా పోవడమే పుణ్యము, దైవత్వాన్ని విస్మరించడమే పాపము.

### అహంకారం పెద్ద అజ్ఞానం

ప్రేమస్వరూపులైన యువతీయువకులారా!

ఈనాడు ఏ వైద్యమునకూ నివారణకాని రోగము అందరిలోను ఉన్నది. అయితే కొందరియందు ఎక్కువగా ఉండవచ్చు, కొందరియందు తక్కువగా ఉండవచ్చు. అసలు ఏమిటా రోగము? అదే అహంకారము. అహంకారము అజ్ఞానముచేత ప్రారంభమవుతుంది. యువతీయువకులారా! అసలు దేనిని చూసి మీకు అహంకారము? వ్యావహారికంగాను, ఆధ్యాత్మికంగాను విచారణ చేస్తే సత్యము మీకే బోధపడుతుంది. ఇంత పెద్ద ప్రపంచముతో పోల్చితే ఇండియా ఎంత చిన్నది! ఇండియాతో పోల్చితే మీ ఊరెంత! ఇంక మీ ఊరిలో మీరెంత! ఇంత అల్పులైన మీరు అనంతమైన ప్రపంచము ముందు అహంకార పడటము పెద్ద అజ్ఞానమే కదా! ఇంక ఆధ్యాత్మిక మార్గంలో విచారణ సల్పితే, ''సర్వం ఖల్విదం బ్రహ్మ'', ఎక్కడ చూసినా దైవత్వమే కదా! దేహములనే బల్బులు వేరుకాని, అందరియందున్న దివ్యత్వమనే కరెంటు ఒక్కటే అనే సత్యాన్ని గుర్తిస్తే అహంకారమునకు ఏమాత్రము అవకాశముండదు. ఎలాంటి పరిస్థితులు సంభవించినా మంచిని మరువకూడదు, దేవుని విడువకూడదు.

### నా జీవితమే నా సందేశం

యువతీయువకులారా! ఈ ప్రపంచానికి మీరు సరియైన నాయకులుగా, సరియైన రక్షకులూగా, సరియైన పోషకులుగా తయారు కావాలి. మీ ప్రవర్తను పవిత్రమైనదిగా మార్చుకోవాలి. దైవప్రేమను మీరు అనుభవించాలి. నా జీవితమే నా సందేశం. స్వామిచెప్పే ప్రతి విషయము ఆచరణలో చూపిస్తున్నదే. మీరు ఎప్పటికీ ఈ ఆదర్శమును వదలకూడదు. ఈనాడు అందరూ ఆశలు పెంచుకుంటున్నారు, ఆదర్శములను మరచిపోతున్నారు; స్వార్థమును పెంచుకుంటున్నారు; పరార్థమును మరచిపోతున్నారు, దేహాభిమానమును పెంచుకుంటున్నారు ; దేశాభిమానమును విస్మరిస్తున్నారు. మరచితే దేహాన్ని మరువవచ్చుకాని, దేశాన్ని మరువకూడదు. మన ప్రాచీనులు సత్యమునకు స్వాగతం పలికారు, న్యాయమునకు కంకణం తొడిగారు, త్యాగమునకు పట్టం కట్టారు. కనుకనే వారు నిరంతరము శాంతిభద్రతలతో జీవిస్తూ వచ్చారు. కాని ఈనాటి ప్రజలకు క్షణక్షణమూ విచారములే! కారణ మేమిటి? వీరియందు సత్యము లేదు, ధర్మము లేదు, త్యాగము లేదు. ఇంక శాంతి లభించాలంటే ఎలా? యువతీయువకులారా! మీరు సత్యమనే ఖడ్గమును, న్యాయమనే కిరీటమును ధరించాలి. ఈనాడు మీరు సరియైన ఆదర్శమును అనుసరించకపోవడంచేత ప్రపంచమంతా క్రుళ్ళి కుమిలి కూలిపోతున్నది. అనేకమంది పైపైకి సుఖంగా ఉన్నట్లు నటిస్తున్నారుకాని హృదయం మాలిన్య సదనమై దుఃఖంతో కుమిలి పోతున్నది.

''ఏమీ లేని బుఱ్ఱలోన ఏమైనా నింపవచ్చు
ఏమేమో నిండియున్న తలబుఱ్ఱ ఖాళీయగునా?
తలబుఱ్ఱ ఖాళీగాక ఇల సుకృతము నింపనగునా?''

మొట్టమొదట తలలో ఉన్న దురాలోచనలను దూరం చేయాలి, అప్పుడే నిర్మలమైన భావములను నింపుకోవడానికి వీలవుతుంది. ఎక్కడ ఉన్నా సేవలో పాల్గొనాలి. తల దైవచింతనలోను, చేతులు సమాజసేవలోను నిమగ్నం కావాలి. మీరు దైవభావములను పెంచుకుంటే దైవంగానే మారతారు, మృగభావములను పెంచుకుంటే మృగముగానే తయారౌతారు.

### మంచితనము - గొప్పతనము

రావణాసురుడు మహావిద్యావంతుడు. రాముడు కూడా అంతటి విద్యావంతుడే! అయితే రాముడు మంచివాడు, రావణుడు గొప్పవాడు. కొందరు మంచివారుగా తయారు కావాలని ఆశిస్తారు, మరికొందరు గొప్పవారుగా రూపొందాలని ప్రయత్నిస్తారు. మంచితనమునకు, గొప్పతనమునకు చాల వ్యత్యాసమున్నది. ఈనాటి తల్లిదండ్రులు తమ కుమారుడు గొప్ప చదువులు చదవాలి, గొప్ప ఉద్యోగము చేయాలి, గొప్పధనమును సంపాదించాలని ఆశిస్తున్నారేకాని, మంచివాడుగా తయారు కావాలని ఆశించటం లేదు. ఎవడు గొప్పవాడు? ఎవడు

మంచివాడు? నారాయణునియందు నరుని దర్శించినవాడు గొప్పవాడు కావచ్చుకాని, నరునియందు నారాయణుని దర్శించినవాడే మంచివాడు. మంచితనము లేకుండా గొప్పతన ముండి ప్రయోజనము లేదు. ఈనాడు ఎంతమందో గొప్పవారున్నారు. కాని వారివల్ల దేశానికి కల్గుతున్న ఉపయోగ మేమిటి? రావణుడు గొప్ప తపస్సు చేశాడు, గొప్ప చదువు చదివాడు. కాని తాను చదివిన చదువును జీర్ణించుకోలేక పోయాడు. అందుచేత అతనికి అజ్ఞానమనే అజీర్ణరోగము ప్రారంభమైనది. అజ్ఞానమువల్ల అతనిలో అనేక దుర్గుణాలు ప్రారంభమైనాయి. తన వాంఛల నరికట్టుకోలేక వంశమునే నాశనం చేసుకున్నాడు, కోరికలను అదుపులో పెట్టుకోలేక కొడుకులను చంపుకున్నాడు, తలంపుల నరికట్టుకోలేక తమ్ముళ్ళను చంపుకున్నాడు, రాగము నదుపులో పెట్టుకోలేక రాజ్యమునే భస్మం గావించుకున్నాడు. రాముడు మాత్రం సత్యధర్మములనే అనుసరిస్తూవచ్చాడు. అందువల్లనే అతడు మంచివాడయ్యాడు. రామాయణము జరిగి ఎన్నోవేల సంవత్సరాలు గడిచి పోయినప్పటికీ ఇప్పటికీ రామనామము ప్రజలహృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయింది. మానవునియందు మాధవత్వమును చూపించాడు రాముడు. అది మంచితనము. మాధవునిలో మానవుని చూడటం మంచితనము కాదు, అది మీ భ్రమ తప్ప మరొకటి కాదు. మానవునియందు కూడా దైవమును చూడాలి. అదే మంచితనము. మనం మంచివారము కావాలికాని, గొప్పవారము కానక్కరలేదు. గొప్ప ధనముండవచ్చు, గొప్ప విద్య ఉండవచ్చు, గొప్ప బలముండవచ్చు, గొప్ప అధికారము ఉండవచ్చు. కాని ఇవన్నీ ఎంతవరకు? ఎవరైనా ప్రైమ్‌మినిస్టర్‌గా ఉన్నాడంటే అతడా పదవిలో ఉన్నంతవరకు అనేకమంది అతని ఇంటిచుట్టూ తిరుగుతుంటారు. ఆ పదవి నుండి దిగి పోయాడంటే రిక్షావాడు కూడా అతనిని లెక్కచేయడు. అనగా గొప్పతనమనేది నేడు ఉంటుంది, రేపు పోతుంది. కాని మంచితనము మాత్రం శాశ్వతంగా ఉంటుంది. అందువల్లనే మంచికి మన జీవితాన్ని అంకితం చేయాలి. మంచితనమంటే ఏమిటి? ధర్మంగా, న్యాయంగా జీవించడం, అందరినీ ప్రేమించడం, దిక్కులేనివారిని ఆదరించడం, దైవాన్ని విశ్వసించడం - ఇవన్నీ మంచితనము యొక్క లక్షణాలు.

యువతీయువకులారా! ఈనాడు ప్రారంభోత్సవం జరిగింది కనుక ఈ సమ్మేళనమునకు సంబంధించి ఒక మాస్టర్‌ప్లాను రూపొందించుకున్నాము. మున్ముందు మీరు చేయవలసిన కర్మలను గురించి, మీ కర్తవ్యములను గురించి, మీ బాధ్యతలను గురించి మనుచ్చటించుకుందాం. ఆధ్యాత్మికమార్గంలో ప్రధానమైనది నామస్మరణే. నామముచేతనే నామిని పొందవచ్చు. కనుక నామస్మరణను అభివృద్ధి చేసుకోండి. అది కూడా ప్రేమతో చేయండి.

*(తేదీః 16-7-1997న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

## భగవంతునికి దూరమూ, దగ్గరా లేవు

*భగవంతునికి భౌతికముగా దూరముగా వున్నామని మీరు బాధపడవద్దు. ఆయనకు దగ్గరా, దూరమూ లేవు. చిరునామా చక్కగా వ్రాస్తే స్టాంపు అంటించినంతమాత్రాన మీ ఉత్తరం పొరుగువీథికీ పోతుంది; ఎంతో దూరాన ఉన్న కలకత్తా, బొంబాయి నగరాలకూ పోగలదు. స్మరణం అనేది స్టాంపు, మననం అనేది చిరునామా. నామమును స్మరించండి, రూపమును ధ్యానించండి. అంతే చాలు. ఒక నామమును, రూపమును ఎన్నుకొని స్మరణ, మననములు సాగించండి. తదితర నామరూపములను చులకన చేయవద్దు.*

*బాబా*

# ప్రథమ ప్రపంచసాయియువజన సమ్మేళనం

ప్రశాంతినిలయంలో జూలై 16 నుండి 18వరకు జరిగిన చారిత్రాత్మకమైన ప్రథమ ప్రపంచ సాయీయువజన సమ్మేళనం సాయిఅవతార ఆధ్యాత్మిక మహోద్యమంలో నూతనాధ్యాయాన్ని ఆవిష్కరించింది. ఇది యువతకు భగవానుడిచ్చిన పిలుపు, ప్రగతికి మరోమలుపు, జగతికి మేలుకొలుపు. ఆశలకు బాని సలై ఆదర్శాలకు తిలోదకాలిస్తున్న నవనాగరిక ప్రపంచ యువ తకు సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలనే మానవతావిలువల ప్రాముఖ్యతను వివరించి, వారిలో నిద్రాణమైయున్న ఆధ్యాత్మిక చైతన్యాన్ని జాగృతం చేయడానికి ఉద్దేశించిన ఈ సమ్మేళనం లో 66 దేశాలకు చెందిన 12 వేలమంది యువప్రతినిధులు సమధి కోత్సాహంతో పాల్గొన్నారు.

16వ తేది ఉదయం 7 గంటలకు శ్రీవారు సాయికుల్వంత్ సభావేదికపై జ్యోతి ప్రజ్వలనం చేసి సమ్మేళనాన్ని ప్రారంభించారు. అనంతరం ''ట్రూత్ నీడ్స్ ఎ హీరో'' అనే ఆంగ్ల గీతం నేపథ్యంలో వినిపిస్తుండగా వివిధ దేశాల యువప్రతినిధులు ఒకరి వెనుక ఒకరు క్రమశిక్షణతో వేదిక వద్దకు వచ్చి తమతమ జాతీయ పతాకములను శ్రీవారికి భక్తిపూర్వకంగా సమర్పించారు. అవి వెనువెంటనే వేదికపై శ్రీవారు ఆసీనులైన సింహాసనాని కిరువైపుల అందంగా అమర్చబడ్డాయి.

సభాప్రారంభంలో అఖిల భారత సాయిసంస్థల అధ్యక్షులు శ్రీ జి.కె. సత్యనారాయణ ప్రతినిధులకు స్వాగతం పలుకుతూ ఈవిధంగా అన్నారు: ''అత్యంత ఆసక్తితో, ఉత్సాహంతో ఈ సమ్మేళనంలో పాల్గొనడానికి ముందుకు వచ్చిన మీ అందరికీ ఈ ప్రశాంతినిలయమనే భూలోకస్వర్గంలోకి హృదయపూర్వకంగా స్వాగతం పలుకుతున్నాను. యౌవనాన్ని మించిన స్వర్గం లేదన్నది ఆధునికుల అభిప్రాయం. కాని ఈ సంస్థతో నాకు గల 31 సంవత్సరాల సుదీర్ఘ అనుభవంతో నేను గుర్తించినదేమిటంటే - ఈ సృష్టిలో ప్రశాంతి నిలయాన్ని మించిన స్వర్గం లేదు, సాయిసన్నిధిని మించిన సుఖం లేదు. ఎక్కడ అమృతం లభిస్తుందో అదే స్వర్గమనీ, అమృతం స్వర్గంలోనే లభిస్తుందనీ మనకు తెలుసు. అలాంటప్పుడు భగవానుని దివ్యదర్శనామృతం, స్పర్శనామృతం, సంభాషణామృతం పుష్కలంగా లభించే ఈ ప్రశాంతినిలయాన్ని మించిన స్వర్గమేముంటుంది! అయితే ఇక్కడ లభించే అమృతాన్ని గ్రోలి అమృతత్వాన్ని సాధించాలంటే మీలో పరిపూర్ణ విశ్వాసం కావాలి. ఈ విశ్వాసం కూడా మనస్సు నుండిగాని, తర్కము నుండిగాని కాక హృదయం నుండి ఆవిర్భవించాలి. చిత్తశుద్ధితో గనుక ప్రయత్నిస్తే దైవవిశ్వాసాన్ని హృదయంలో పదిలపర్చుకోవడానికి యౌవనమే మంచి తరుణం. ఈ విషయంలో సాక్షాత్తు భగవానుడే మీకు సారథ్యం వహించడంచేత ఈ సమ్మేళనం మరింత విశిష్టతను సంతరించుకొన్నది''. అంతర్జాతీయ సాయిసంస్థల చైర్మన్ శ్రీ ఇందులాల్‌షా సమ్మేళనం యొక్క ముఖ్యోద్దేశాలను వివరిస్తూ, ''మార్గం తెలియనివారు గమ్యం చేరలేరు. గమ్యం ఎఱుగనివారు మార్గము నెన్నుకోలేరు. కనుక ఈ సమ్మేళనం యువతకు గమ్యాన్ని సూచించి మార్గాన్ని నిర్దేశించడానికి ఏర్పాటు చేయడం జరిగింది. తోటి మానవులకు నిస్స్వార్థంగా ప్రేమను పంచడమనే మహోన్నతమైన ఆధ్యాత్మిక సాధనద్వారా మనలో నిగూఢంగా ఉన్న దివ్యత్వాన్ని గుర్తించుకోవడానికి ఈ సమ్మేళనం ఒక కార్యాచరణ ప్రణాళికను రూపొందిస్తుంది. ఈ సాధనాపథంలో పురోగమించడానికి సాయిసంస్థ గత 30 సంవత్సరాలుగా మానవాళికి ఎంతగానో ఉపకరిస్తున్నదని మీకు తెలుసు. ఇక దీనిని 21వ శతాబ్దంలోకి గొనిపోవలసిన బాధ్యత నేటి యువతపై ఎంతేని ఉన్నది. సాయిఅవతారానికి సమకాలీనులుగా పుట్టినవారు అదృష్టవంతులు. అయితే అవతారలక్ష్యసిద్ధిలో పనిముట్లుగా రూపొందేవారే ధన్యులు, పుణ్యులు'' అని పేర్కొన్నారు.అనంతరం శ్రీవారు తమ దివ్యసందేశాన్ని అనుగ్రహించారు.

సాయికుల్వంత్‌లో సమ్మేళన ప్రారంభ కార్యక్రమం ముగిసిన తరువాత పూర్ణచంద్ర ఆడిటోరియంలో ప్రతినిధులకు రెండు పూటల ప్రత్యేక సమావేశాలు నిర్వహింపబడ్డాయి.

సాయిసంస్థలకు సంబంధించిన దేశవిదేశ ప్రముఖులు ఇందులో ప్రసంగించారు. నిత్యజీవితంలో సత్యధర్మాల ఆవశ్యకత, ఆధ్యాత్మికసాధన, దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి మున్నగు పలు అంశాలపై సాయంత్రం చర్చాగోష్ఠి నిర్వహింపబడింది. మానవాభ్యుదయశిక్షణలో కనీసం ఐదు సంవత్సరాల అనుభవం గల్గిన ప్రతినిధులు, శ్రీసత్యసాయి ఉన్నత విద్యాసంస్థకు చెందిన పూర్వపు విద్యార్థులు ఇందులో పాల్గొన్నారు.

రెండవ రోజున జరిగిన సమావేశాలలో ప్రపంచవ్యాప్తంగా సాయిసంస్థల యువజన విభాగాలు చేపట్టవలసిన సేవాకార్యక్రమాల కార్యాచరణ పథకాలను రూపొందించడం జరిగింది. సాయంత్రం భగవానుని దివ్యోపన్యాసానంతరం పూర్ణచంద్ర ఆడిటోరియంలో భక్తిసంగీత కార్యక్రమం నిర్వహింపబడింది.

18వతేది మధ్యాహ్నం సాయికుల్వంత్ సభామండపంలో సమ్మేళనం యొక్క ముగింపు కార్యక్రమం జరిగింది. ముందుగా భారత ప్రతినిధి ఒకరు, విదేశీ ప్రతినిధి ఒకరు, మహిళా ప్రతినిధుల తరఫున ఒకరు ప్రత్యేక నివేదికలను సమర్పించారు. తమ దృష్టిని ఆధ్యాత్మిక విద్యా సేవా కార్యక్రమాల పట్ల కేంద్రీకరించడానికి ఈ సమ్మేళనం తమకెంతగానో ఉపకరించిందని అన్నారు. సమ్మేళనం ఆమోదించిన తీర్మానాలను ప్రస్తావిస్తూ, వ్యక్తిగత కుటుంబ సామాజిక అభ్యున్నతికి తాము శక్తివంచన లేకుండా కృషి చేస్తామని ప్రతిజ్ఞ చేశారు.

శ్రీసత్యసాయి వరల్డ్‌కౌన్సిల్ చైర్మన్ శ్రీ గోల్డ్‌స్టైన్ (అమెరికా) సమ్మేళనం యొక్క ముఖ్యవిశేషాలను తెలియజేస్తూ, కేవలం విదేశీ ప్రతినిధులను మాత్రమే దృష్టియందుంచుకొని, 66 దేశాల నుండి రెండువేలమంది ప్రతినిధులు హాజరయ్యారని అన్నారు. వెంటనే శ్రీవారు కలుగజేసుకొని, ''రెండువేలమంది కాదు, భారతీయులతో కలుపుకొని పన్నెండువేలమంది'' అని సవరించేసరికి సభాస్థలి కరతాళధ్వనులతో మార్మోగింది. తరువాత అంతర్జాతీయ సాయి సంస్థల కోఆర్డినేటర్ శ్రీ జగదీశన్ (మలేషియా), శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ సభ్యులు శ్రీనివాసన్ ప్రసంగించారు. సమ్మేళనానికి హాజరైన ప్రతినిధులందరికీ దయతో పాదనమస్కార భాగ్యాన్ని ప్రసాదించమని శ్రీవారిని శ్రీ జగదీశన్ సభాముఖంగా వేడుకోగా ప్రతినిధులందరూ తమ హర్షామోదాలను వ్యక్తం చేస్తూ రెండు మూడు నిమిషాలపాటు పెద్ద పెట్టున కరతాళ ధ్వనులు చేశారు.

శ్రీ జగదీశన్ తమ ప్రసంగంలో - భగవానుని అనుగ్రహబలం లేక మనం సాధించగల్గేది ఏమీ లేదనీ, అంకెల ప్రక్కన సున్నలకు విలువ అబ్బినట్లుగా భగవానునితో కూడినప్పుడే మన జీవితాలకు విలువ ఏర్పడుతుందనీ అభిప్రాయపడ్డారు. ఆయన అభిప్రాయంతో ఏకీభవిస్తూ శ్రీ శ్రీనివాసన్ తాను ఇటీవల విదేశాలలో పర్యటించినప్పుడు అనేకమంది దేశాధినేతలు, విద్యావేత్తలు, మంత్రులు, పాలకులు, పలువురు ప్రముఖులు తనను కలుసుకొని మాట్లాడాలని ఉవ్విళ్ళూరారనీ, అయితే ఇందులో తన గొప్పతనమేమీ లేదనీ, తానొక సాయిభక్తుడనని వారికి తెలియడమే ఇందుకు కారణమనీ పేర్కొన్నారు. శ్రీవారి దివ్యసందేశానంతరం మంగళ హారతితో సభ ముగిసింది.

19వ తేది మధ్యాహ్నం మూడుగంటలకు పూర్ణచంద్ర ఆడిటోరియంలో శ్రీవారు ప్రతినిధుల నుద్దేశించి ప్రత్యేకంగా అనుగ్రహభాషణం సల్పారు. ముందురోజున అనవసరంగా చప్పట్లతో సభను హోరెత్తించినందులకు వారిని సున్నితంగా మందలించారు. కాలము భగవత్స్వరూపమనీ, క్షణమైనా వ్యర్థం చేయడం తగదనీ హితవు చెప్పారు. సాయంత్రం బెంగాల్ బాలవికాస్ పిల్లలు శ్రీరామకృష్ణపరమహంస, స్వామి వివేకానందుల జీవిత చరిత్ర ఆధారంగా, ''గురుశిష్యులు'' అనే నాటికను ప్రదర్శించారు. నాటికలో వివేకానందుని పాత్ర సాయి ఉద్యమంలో నేటి యువత నిర్వహించవలసిన పాత్రను మరొక్కసారి గుర్తు చేసింది.

ప్రథమ ప్రపంచ సాయియువజన సమ్మేళన సందర్భంగా ప్రశాంతినిలయంలో నార్త్ ఇండియన్ క్యాంటీన్‌లో ప్రత్యేక ఎగ్జిబిషన్ ఏర్పాటు చేయబడింది. వివిధ దేశాలలో సాయిసంస్థలు చేపట్టిన సేవాకార్యక్రమాలను వివరించే వీడియో చిత్రాలు, ఛాయాచిత్రాలు ఇందులో చోటుచేసుకున్నాయి.

20వ తేదీన వ్యాసపూర్ణిమ మహాపర్వదిన సందర్భంగా ఉదయం 7 గంటలకు విద్యార్థులు సాయికుల్వంత్ హాల్‌లో భక్తి సంగీత కార్యక్రమాన్ని నిర్వహించారు. సాయంత్రం నాల్గుగంటలకు శ్రీవారు తమ దివ్యసందేశాన్ని అనుగ్రహించారు.

(గమనిక: జూలై 16 నుండి 19 వరకు శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశాలు ఈ సంచికలోనే ప్రచురింపబడినవి. 20వ తేది నాటి వ్యాసపూర్ణిమసందేశం రాబోయే సంచికలో రాగలదు.)

# భగవన్నామమే శరణ్యం

ప్రేమస్వరూపులారా!

గర్వము, అహంకారము గలవానిని ఎవ్వరూ ప్రేమించరు. కడకు అతని భార్యాబిడ్డలు కూడా ప్రేమించరు. ఇతరులు తనను ప్రేమించాలని ఆశించేవాడు మొదట తన గర్వమును, అహంకారమును నిర్మూలించుకోవాలి. అట్లే క్రోధమున్నంతవరకు మానవునికి దుఃఖం తప్పదు. క్రోధమును నిర్మూలించుకొన్ననాడే అతనికి సుఖము చేకూరుతుంది. ఆశలున్నంత కాలము మానవుడు దరిద్రునిగానే జీవిస్తాడు. ఆశలను తగ్గించుకొన్నప్పుడే అతనికి సర్వసంపదలు చేకూరుతాయి. అట్లే లోభత్వమును నిర్మూలించుకొన్నప్పుడే తాను సుఖజీవనమును అనుభవించగలడు.

ప్రపంచమంతయు ప్రేమపైనే ఆధారపడి యున్నది. ఈ ప్రేమయే భగవత్స్వరూపం. భగవంతుడు సర్వుల హృదయమందు ప్రేమస్వరూపుడై ఉంటున్నాడు. కనుకనే మన ప్రాచీన మహర్షులు, ''లోకాస్సమస్తా స్సుఖినో భవంతు'', సర్వులూ సుఖంగా ఉండాలని ప్రార్థన చేస్తూ వచ్చారు. లోకశాంతి నిమిత్తమై వారు తమ సర్వస్వమును త్యాగం చేశారు. త్యాగముచేత వారు యోగము ననుభవించారు. కాని నేటి యువకులు భోగములో మునిగి రోగులుగా తయారవుతున్నారు.

### మానవుడు కర్మక్షేత్రయాత్రికుడు

మనమేదైనా క్షేత్రమునకు వెళ్ళినప్పుడు మన వెంట తీసుకొని వెళ్ళిన ధనమును కాపాడుకొనే నిమిత్తమై అనేకవిధాలుగా ప్రయత్నిస్తాము. కడపటికి మన కొక నమ్మకమైన మిత్రుడు చిక్కితే అతనివద్ద మన ధనమును దాచిపెట్టి హాయిగా క్షేత్రదర్శనం చేసుకుంటాము. అదేవిధముగా ప్రతి మానవుడు జన్మించినప్పుడు తనతోపాటు ప్రేమధనమును కూడా తీసుకొని వస్తున్నాడు. ఇది జన్మించిన తరువాత లభ్యమయ్యేది కాదు, మానవునితో పాటు ప్రేమ కూడా జన్మిస్తుంది. అయితే ఈ కర్మక్షేత్రంలో ప్రేమధనమును కాపాడుకోవడం చాల కష్టంగా ఉంటుంది. కనుక మానవుడు ఒక నమ్మకమైన మిత్రునికోసం వెతకాలి. ఆ మిత్రుడే దేవుడు. తన ప్రేమధనమును అతని చేతికిచ్చినప్పుడే మానవుడు సుఖశాంతులతో జీవించడానికి వీలవుతుంది. మానవునికి హృదయమే నిజబోధకుడు, కాలమే నిజగురువు, ప్రపంచమే పెద్ద గ్రంథము, భగవంతుడే గొప్ప మిత్రుడు. ఈ నాల్గింటినీ విశ్వసించి ఈ జగత్తనే కర్మక్షేత్రంలో తన జీవనయాత్ర సాగించాలి.

మానవ జీవిత వృక్షంలో ప్రేమ అనే ఫలము లభిస్తున్నది. అయితే ఈ ఫలములోని మధుర రసమును గ్రోలవలెనన్న దీనిని కప్పియున్న అహంకారమనే పై తోలును, అభిమాన మమకారములనే విత్తనములను తీసివేయాలి. భగవంతుడు రసస్వరూపుడు. దీనినే వేదాంతము, ''రసోవైసః'' అన్నది.

''ప్రేమ రూపంబు బ్రహ్మంబు ప్రేమమయము
ప్రేమను ప్రేమతో సంధింప నీమమగును
కాన ప్రేమను గట్టిగా కలిగియున్న
అద్వితీయము నొందంగ అర్హుడగును''

ఏకత్వాన్ని అనుభవించుటకు పవిత్రమైన ప్రేమతత్త్వమే రాజమార్గము. వ్యష్టి నుండి సమిష్టికి సల్పు ప్రయాణమే మానవ జీవితం. కాని ఈనాటి మానవుడు తన జీవిత ప్రయాణము ను 'నేను' తో ప్రారంభించి తిరిగి 'నేను'తోనే అంత్యం గావిస్తున్నాడు. ఇట్టి స్వార్థమే మానవత్వాన్ని బలహీనపర్చుచున్నది.

### స్వార్థప్రేమ, అన్యోన్యప్రేమ, పరార్థప్రేమ

స్వార్థప్రేమ, అన్యోన్యప్రేమ, పరార్థప్రేమ అని మూడు విధములుగా ప్రేమ మనకు గోచరిస్తున్నది. ఎవరేమైపోయినా ఫరవాలేదు, నేను మాత్రం క్షేమంగా, సుఖంగా ఉండాలని ఆశించడం స్వార్థప్రేమ. తనతోపాటు తన బంధుమిత్రులు కూడా క్షేమంగా ఉండాలని ఆశించడం అన్యోన్యప్రేమ. ఇంక, ''లోకాస్సమస్తా స్సుఖినో భవంతు'', అందరూ సుక్షేమంగా

ఉండాలని ఆశించడం పరార్థప్రేమ. స్వార్థప్రేమ అనేది ఒక గదిలో వేసిన బల్బువంటిది. ఆ బల్బు నుండి వచ్చే వెలుతురు ఆ గదికి మాత్రమే పరిమితమై ఉంటుంది. అన్యోన్యప్రేమ చంద్రకాంతి (Moon light) వంటిది. ఇది అన్నివైపులకు ప్రసరిస్తుందికాని అంత స్పష్టంగా ఉండదు. ఇం... ...ంత సందేహానికి కూడా అవకాశ మంటుంది. వెన్నెల... ...డును పాముగాను, మొద్దు చెట్టును మనిషిగాను భ్రమించడం జరుగుతుంది కదా! అదే విధంగా అన్యోన్యప్రేమలో మంచిని చెడ్డగా, చెడ్డను మంచిగా భావించడం జరుగుతుంది. చెడ్డవారి మాటలు అతి తీయగా ఉంటాయి, మంచివారి మాటలు కొంత కఠినంగా అనిపిస్తాయి. నిర్మల నిశ్చల నిస్స్వార్థమైన దైవత్వంపైన కూడా సందేహాన్ని కలిగిస్తుంది ఈ అన్యోన్యప్రేమ. ఇంక పరార్థప్రేమ అనేది సూర్యకాంతివంటిది. ఇందులో ప్రతి ఒక్కటి మనకు సుస్పష్టంగా గోచరిస్తుంది. ఇది అందరికీ సుక్షేమాన్ని చేకూర్చుతుంది.

### భగవత్ప్రేమ

ప్రాకృతమైన ప్రేమ పుచ్చుకుంటుందిగాని ఇచ్చుకోదు. కాని పరమాత్మ ప్రేమ ఇచ్చుకుంటుందిగాని పుచ్చుకోదు. ఇదే పరమాత్మ ప్రేమకున్న ప్రధానమైన గుణము. ప్రాకృతమైన ప్రేమకు ఎవరేమి చెబుతారో, ఎవరేమంటారో అనే భయముంటుంది. ఎందుకంటే అది అంతో ఇంతో స్వార్థంతో కూడినది. కాని పరమాత్మప్రేమకు ఎట్టి స్వార్థమూ లేదు. కనుక ఎట్టి భయమూ లేదు. ఇది రెండవ గుణము. ఇంక ప్రేమకు ప్రేమయే ఫలము. ఇది మూడవ గుణము. అందువల్లనే ప్రేమ త్రికోణస్వరూపమని అన్నారు. ఒకటి ప్రేమ ఇచ్చుకునేదేగాని, పుచ్చుకునేది కాదు, రెండవది ప్రేమకు ఎట్టి భయమూ లేదు, మూడవది ప్రేమకు ప్రేమయే ఫలము. వర్షం కురిసే సమయంలో వడగళ్ళు కూడా పడతాయి. వర్షబిందువులవల్ల మనకు ప్రమాదము లేదుకాని, వడగళ్ళు తాకితే కొంత దెబ్బ తగలవచ్చు. అయితే వాటిలో ఉన్నది కూడా నీరే! అదేవిధంగా భగవంతుని చర్యలు అప్పుడప్పుడు వడగళ్ళవలె కొంత బాధ కలిగించవచ్చు. కాని అవి కూడా ప్రేమరసముతో నిండినవే! ఇట్టి భగవత్తత్త్వాన్ని మనం పరిపూర్ణంగా విశ్వసించాలి. ప్రేమయే దైవము, దైవమే ప్రేమ. ఈ ప్రేమలోనే మనం జీవించాలి. పరమాత్మప్రేమ పరిశుద్ధమైనది, స్వార్థ రహితమైనది. దీనిని ప్రాచీన మహర్షులు, ''నిర్గుణం నిరంజనం సనాతనం నికేతనం నిత్య శుద్ధ బుద్ధ ముక్త నిర్మల స్వరూపిణమ్'' అని వర్ణించారు. ఇలాంటి భగవత్ప్రేమ సంకుచిత హృదయులకు సరియైనదిగా కనిపించదు. కారణమేమిటి? వారిప్రేమ స్వార్థముతో కూడియుంటుంది. భగవత్ప్రేమ నిస్స్వార్థమైనది. సామాన్య మానవులు పరులలోని చిన్న దోషములనైనా పెద్ద దోషములుగా భావిస్తారు, తమలోని గొప్ప తప్పులను కూడా చిన్నవిగా విశ్వసిస్తారు. ఇది చాల పొరపాటు. మనం పరులయందున్న పెద్ద తప్పునైనా చిన్నదిగా విశ్వసించాలి, మనలోని చిన్నతప్పులను కూడా పెద్దవిగా భావించాలి. అప్పుడు ఇంక పెద్ద తప్పులకు మనం పాల్పడము.

### ప్రాకృత ప్రేమ

ఈనాటి ప్రాకృతప్రేమ ఎలా ఉన్నదంటే ఒక చిన్న ఉదాహరణ : వివాహము జరిగిన తొలిరోజులలో భర్త భార్యపై మితిమీరిన ప్రేమను ప్రదర్శిస్తాడు, వైఫే లైఫ్‌గా భావిస్తాడు. ఇరువురూ కలిసి బీచ్‌లో వాహ్యాళికి వెళ్ళినప్పుడు భర్తకంటికి ఒక ముల్లు కనిపించిందనుకోండి. తక్షణమే తన భార్యచేయి పట్టుకొని, ''ముల్లు....ముల్లు...'' అని ఆదుర్దాగా వెనక్కి లాగుతాడు. ఆ ముల్లు గుచ్చుకుంటే తన భార్య పాదమునకు ఏ ప్రమాదము వాటిల్లుతుందోననే భయముచేత, లౌకికమైన ప్రేమచేత ఈ విధమైన 'నటన' చేస్తాడు. మూడునెలలు గడిచిన తరువాత మరొక మార్గంలో నడుచుకుంటూ వెళుతున్నప్పుడు మళ్ళీ భర్త కంటికి ముల్లు కనిపిస్తే, ''అక్కడ ముల్లు ఉంది, జాగ్రత్త'' అని భార్యను హెచ్చరిస్తాడు. అనగా మొదటి మూడు నెలలలోనే భార్యపై ప్రేమ కొంత తగ్గిపోయిందన్నమాట. ఇంక ఆరు నెలలు గడిచిన తరువాత ఇరువురూ ఒక తోటలో నడుస్తున్నప్పుడు భర్తకంటికి మళ్ళీ ఒక ముల్లు కనిపించిందంటే భార్యతో ఏమంటాడు? ''కళ్ళు కనిపించటంలేదా? అక్కడ ముళ్ళు ఉన్నాయి, వెనక్కి రా'' అంటాడు. చూశారా! కేవలం ఆరునెలలకే ఈ ప్రేమ ఎంతగా సన్నగిల్లిందో! దీనికి ప్రేమ అని పేరు పెట్టారేకాని, ఇది ప్రేమ కాదు. ఇది ఎటాచ్‌మెంట్‌వల్ల కలిగే రియాక్షన్ మాత్రమే. కాని భగవంతుని ప్రేమ ఎప్పటికీ నిష్కల్మషమైనదిగాను, నిస్స్వార్థమైనదిగానే ఉంటుంది. ఇట్టి ప్రేమను అందరూ అర్థం చేసుకోలేరు. అర్థం చేసుకోలేక పోతే పోనీగాని, కొందరు అపార్థము చేసుకుంటారు. తుచ్ఛమైన కోరికలచేత భగవంతుని ప్రార్థించి నిరాశ కలిగితే భగవంతుడినే ద్వేషించడం ప్రారంభిస్తారు.

### దైవానికి ఎవరు దూరం? ఎవరు దగ్గర?

ఈనాడు అనేకమంది మోక్షము కావాలని ఆశిస్తున్నారు. ఏమిటో వీరికి కావలసిన మోక్షము నాకర్థం కావటం లేదు.

భగవంతుని చూడాలని ఆశించేవాడు భగవద్భావమును హృదయంలో నింపుకోవాలి కదా! భగవద్భావము లోపల లేకుండా భగవంతుని చూడాలనుకుంటే ఏరీతిగా కనిపిస్తాడు? భగవంతునిపై పూర్ణవిశ్వాసము లేకుండా ఎంత సమీపంలో ఉన్నా భగవత్తత్వం అర్థం కాదు. తామర పుష్పము చెంతనే కప్ప నివసిస్తుంది. కాని దానికి పుష్పములోని మకరందపు రుచి ఏమాత్రము తెలియదు. కారణమేమిటి? దానిలో మధురమైన మకరంద మున్నదనే విశ్వాసము దానికి లేదు గనుక. అట్టి విశ్వాసమున్న తుమ్మెదలు ఎక్కడెక్కడి నుండో, ఏ దేశముల నుండో పరుగెత్తి వస్తుంటాయి. ఈవిధంగా మీరు దివ్యత్వానికి దగ్గరగా ఉన్నా దూరమైపోతున్నారు, వారు దూరంగా ఉన్నా దగ్గరవారైపోతున్నారు. కనుక ప్రేమ ఎట్లాంటిదంటే దూరస్థుని కూడా సమీపస్థునిగా చేస్తుంది, వియోగమును సంయోగంగా మార్చుతుంది, నరుని నారాయణునిగా చేస్తుంది.

## హృదయం మ్యూజికల్ చైర్ కాదు

ప్రేమస్వరూపులారా! ప్రతి వ్యక్తియందు ఉన్నది ప్రేమయే. కాని దానిని స్వార్థంలో ప్రవేశపెట్టడంచేత అది అనుబంధంగా మారిపోతున్నది. ప్రేమ అనుబంధంగా ఉన్నంతవరకు అనుభూతిలోకి రాదు. ముఖ్యంగా ఈనాటి యువకులు ప్రేమతత్వాన్ని చక్కగా గుర్తించాలి. ఈనాడు విదేశీయులలోను, స్వదేశీయులలోను యువతీయువకుల మధ్య 'ఫ్రెండ్‌షిప్' అనేది పెరిగిపోతున్నది. ఇది చాల ప్రమాదాలకు దారితీస్తున్నది. ''హి ఈజ్ మై బాయ్ ఫ్రెండ్, షి ఈజ్ మై గర్ల్‌ఫ్రెండ్'' అని గొప్పగా చెప్పుకుంటున్నారు. యువతీయువకులారా! మీరు పూర్తిగా మ్యారేజి చేసుకోండి, మంచిదేకాని, ఇటువంటి ఫ్రెండ్‌షిప్ మాత్రం చేయకండి. ఈ రోజు ఒక ఫ్రెండ్, రేపు మరొక ఫ్రెండ్, నెల తరువాత ఇంకొక ఫ్రెండ్ ఈవిధంగా మార్చుకోవడం మంచిది కాదు. మీకున్నది ఒకే హృదయం. అది సింగిల్ చైరేకాని, మ్యూజికల్ చైర్ కాదు. కాని మీరు మీ హృదయాన్ని మ్యూజికల్ చైర్‌గా మార్చుకోవడంచేతనే జీవితంలో అశాంతికి గురి అవుతున్నారు. ఒక చిన్న ఉదాహరణ. పది సంవత్సరములకు పూర్వం ఈ మందిర ప్రాంగణంలో కుడివైపున ఒక వృక్షముండేది. ఒకనాడు భజన అయింది, హారతి అయింది, అందరూ వెళ్ళిపోయారు. నేను బయటికి వచ్చాను. అది నా వాడుక. ఒక 17 సంవత్సరముల అమెరికన్ పిల్లవాడు ఆ చెట్టుక్రింద కూర్చొని చాల విచారంగా కనిపించాడు. ఎక్కడి నుంచి వచ్చావని అడిగాను. అమెరికా నుండి వచ్చానని చెప్పాడు. ఎందుకింత విచారంగా కనిపిస్తున్నావు? అని అడిగాను మళ్ళీ. నాకు తెలుసు. కాని అతని ద్వారానే చెప్పించాలని నా ఉద్దేశ్యం. 17 సం॥ల పిల్లవానికి అంత దుఃఖము కల్గడానికి కారణం ఏమిటి? అసలు దుఃఖమంటే ఏమిటో నాకు తెలియదు. కాని అడిగాను, ఎందుకు దుఃఖిస్తున్నావు? అని. ఆ పిల్లవాడు నా పాదాలు పట్టుకొని గట్టిగా ఏడ్చాడు. ''స్వామీ! నా రెండవభార్య నన్ను వదలిపెట్టి పోయింది. ఆమెకొక బిడ్డ ఉన్నది. ఆ బిడ్డ అంటే నాకు చాల ప్రేమ. ఆ బిడ్డను కూడా ఆమె తీసుకుపోయింది'' అన్నాడు. 17సం॥ల వయస్సులో వీడిని రెండవ భార్య వదలి పెట్టిందట! ఇంక 20 సంవత్సరాలైతే నాల్గవ భార్యకూడా వచ్చేస్తుంది, వీడు చస్తే నల్గురూ కలసి మోసుకు పోతారు!

## త్రికరణశుద్ధి గలవాడే మానవుడు

ఈనాటి మానవుడు మానవత్వమంటే ఏమిటో అర్థం చేసుకోవటం లేదు. మానవుడనగా లాటిన్ భాషలో పవిత్రమైన వాడని అర్థం. నమ్మకమైనవాడు మానవుడని ఉపనిషత్తులు అన్నాయి. ఇట్టి మానవు డీనాడు ఇంతటి శక్తిహీనుడగుటకు కారణమేమి? తన తత్వాన్ని తాను గుర్తించుకోలేకపోవడమే! మానవత్వం ఎంత దివ్యమైనది! ఎంత భవ్యమైనది! ఎంత నవ్యమైనది! మా – అనగా కాదు, నవ – అనగా క్రొత్త. కనుక మానవుడనగా క్రొత్తవాడు కాదు. ''నేను పురాతనుడను, నేను సనాతనుడను. దేహములు మారుతున్నాయికాని, నేను మారటం లేదు'' అనే సత్యాన్ని మానవుడు గుర్తించాలి. యువతీ యువకులారా! ఆహారవిహారములవల్ల మీలో అనేక ఆలోచనలు కలుగుతుంటాయి. ఏ ఆలోచన వచ్చినా అది మంచిదా కాదా? అని విచారణ చేయండి. కేవలం పుస్తక జ్ఞానంవల్ల ప్రయోజనం లేదు, అనుభవజ్ఞానం అత్యవసరం. ఈనాడు మీరు చదివే చదువుకు, నడిచే నడతకు ఏమాత్రము సంబంధం లేకుండా ఉన్నది. త్రికరణశుద్ధి గలవాడే మానవుడు. మీ మనస్సు, మాట, క్రియ ఏకం కావాలి. దైవవిశ్వాసాన్ని పెంచుకోండి, దైవంపై సందేహాలకు ఏమాత్రము అవకాశ మీయకండి. ఒకవేళ మీలో ఏమైనా సందేహాలు కలిగాయంటే అవి మీ భ్రమలేకాని భగవంతుని దోషం కాదని గుర్తించండి. మీకు కనిపించేదంతా మీ అంతర్భావము యొక్క రిఫ్లెక్షన్, రియాక్షన్, రిసౌండ్‌లు మాత్రమే. భగవంతునికి రిఫ్లెక్షన్ లేదు, రియాక్షన్ లేదు, రిసౌండ్ లేదు.

ఉన్నది ఒకే సౌండ్. అదే సత్యము. అందులో ఎట్టి మార్పు ఉండదు. అట్టి సత్యస్వరూపుడైన దైవాన్ని విశ్వసించాలి. కాని ఈనాడు లోకంలో దైవమంటే ఎవరో అర్థం చేసుకోలేక పోతున్నారు; నీతినిజాయతీలంటే ఏమిటో గుర్తించలేక పోతున్నారు; ధనమునకు దాసులై దైవాన్ని విస్మరిస్తున్నారు.

### నిర్మలప్రేమయే శాంతికారకం

మనం మన పడక గదికి సీలింగ్ ఫ్యాన్ పెట్టుకున్నాము, ఎయిర్‌కండిషన్ వేసుకున్నాము, డన్‌లప్ బెడ్ పరుచుకున్నాము, డన్‌లప్ దిండ్లు వేసుకున్నాము. కాని పడుకుంటే నిద్ర రావటం లేదు. ఇంక ఇవన్నీ ఉండి ఏమి ప్రయోజనం? అదేవిధంగా మన దేహము, మనస్సు, బుద్ధి, చిత్తము, ఇంద్రియాలు - ఇవన్నీ మనం శాంతి అనే సుఖనిద్ర పొందే నిమిత్తమై ఏర్పడినాయి. ఇవన్నీ చేరి మనకు శాంతిని అందించకపోతే ఇంక దేహమెందుకు? మనస్సెందుకు? బుద్ధి ఎందుకు? ఇంద్రియా లెందుకు? మనలో నిర్మలమైన, నిస్స్వార్థమైన ప్రేమను పెంచుకున్నప్పుడే ఇవి మనకు శాంతిని చేకూర్చుతాయి.

### శాశ్వతానందప్రాప్తికే దైవప్రార్థన చేయాలి

ఈనాటి మానవులు భగవంతుని ప్రార్థిస్తున్నారు. కాని ఏమని? డబ్బు కావాలనీ, ఇళ్ళు కావాలనీ, పిల్లలు కావాలనీ, అధికారం కావాలనీ ఈవిధంగా ప్రాకృతమైన విషయాలను గురించి ప్రార్థిస్తున్నారు. ఇవి కాదు మనం భగవంతుడి నుండి కోరవలసినవి. ఏది నీ దగ్గర లేదో దానికోసం ప్రార్థించాలి. నీ దగ్గర ప్రేమ లేదు, శాంతి లేదు, ఆనందం లేదు. అవన్నీ భగవంతుని దగ్గరే ఉన్నాయి. కనుక వాటి నిమిత్తమై భగవంతుని ప్రార్థించు. నీ దగ్గర సంతోషమున్నది గాని ఆనందం లేదు.* సంతోషం తలకు సంబంధించినది, ఆనందం హృదయానికి సంబంధించినది. అట్టి ఆనందమును నీవు భగవంతుని నుండి ఆశించు. నీ దగ్గర పెన్ను లేకపోతే ఇతరుల నడగాలికాని, నీ దగ్గరే రెండు పెన్నులుండగా మరొకటి కావాలని కోరడమెందుకు? నీ దగ్గర డబ్బు ఉన్నది, ఆహారవిహారాదులు దండిగా ఉన్నాయి. ఇంక వాటిని గూర్చి భగవంతుని ఎందుకు ప్రార్థించడం? కనుక, నీవు భగవంతుని అడుగవలసింది లౌకికమైనవి కావు. ''భగవంతుడా! నాకు ప్రశాంతిని ప్రసాదించు, ఆనందమును ప్రసాదించు, ప్రేమను ప్రసాదించు'' అని ప్రార్థించాలి. కాని ఈనాడు నీవు చేసే ప్రార్థనలకు హద్దు, పద్దు ఏమీ లేదు, ఇష్టమొచ్చినట్లు భగవంతుని ప్రార్థిస్తున్నావు. అయితే నీవు అడిగిన వన్నీ భగవంతుడు అందిస్తాడా? ఎప్పటికీ అందించడు. నీకేది క్షేమకరమో నీకు తెలియక పోయినా భగవంతునికి తెలుసు. కనుక నీ క్షేమాన్ని దృష్టియందుంచుకొని భగవంతుడు కొన్నికొన్ని నీవు అడిగినా అందించకుండా ఉంచాడు. అదంతా నీ మంచి కోసమే! భగవంతుడు ఏది చేసినా నీ మంచికే! కాని ఈ సత్యాన్ని నీవు గుర్తించలేక పోతున్నావు. భగవంతుడు సర్వసాక్షి, అన్ని విధములుగా నీ క్షేమాన్నే ఆశిస్తాడు. కనుక నీ సర్వస్వమును భగవంతునికి అర్పితం చేయి, భగవంతుడు అందించినదాన్ని అందుకో, ఆనందంగా జీవితాన్ని గడుపుకో.

### ఎవరిని బాధించినా దైవాన్ని బాధించినట్లే!

ఇతరులకు అపకారం చేయకు, ఉపకారమే చేయి. ఇదే నీవు చేయవలసిన ప్రధానమైన సేవ. ''సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్'' అన్ని శిరస్సులూ, అన్ని నేత్రములూ, అన్ని పాదములూ భగవంతునివే. కనుక ఎవరిని బాధించినా భగవంతుని బాధించినట్లే అవుతుంది. బైబిల్‌లో దీనికొక చిన్న కథ ఉన్నది. సెయింట్ జాన్ ఒకనాడు ఒక సోదరుని చాల కఠినంగా శిక్షించాడు. ఆనాటి రాత్రి జీసస్ అతనికి స్వప్నంలో కనపడి, ''పిచ్చివాడా! అతడు పరాయివాడని భావించి నీవు నన్ను చాల బాధ పెట్టావు. సర్వుల హృదయంలో నున్నది భగవంతుడే! కనుక ఏ హృదయాన్ని బాధించినా భగవంతుని బాధించినట్లే! ఏ దేహాన్ని శిక్షించినా భగవంతుని శిక్షించినట్లే!'' అని బోధించాడు. ఇట్టి ఏకత్వభావము మీలో అభివృద్ధి కావాలంటే భగవంతుణ్ణి ప్రేమతో ప్రార్థించాలి.

### ప్రేమే ప్రాణం, ప్రాణమే ప్రేమ

ఈనాడు మనం జపములు, ధ్యానములు, భజనలు ఇత్యాది సత్కర్మల నెన్నిటినో ఆచరిస్తున్నాము. ఇవన్నీ చిత్త శుద్ధి నిమిత్తమై ఏర్పడినవే. మనస్సు పవిత్రమైతే అంతా పవిత్రమైపోతుంది. దీని నిమిత్తమై ప్రేమను అభివృద్ధి పర్చుకోవాలి. ప్రేమను మించిన ప్రాణం లేదు. ఒక పచ్చని మొక్కను మనం నాటాము. దానిని ఎంతో శ్రమపడి పోషించాము. కాని

కొన్ని దినముల తరువాత దాని ఆకులు వాడిపోయినాయి, కొమ్మలు ఎండిపోయాయి. అప్పుడు దానిని నిర్దాక్షిణ్యంగా పెరికి పారవేశాము. దానిలో పచ్చదనమనే ప్రాణమున్నంత వరకు దానిని ప్రేమించాము, అది పోయేసరికి దానిని నిర్దాక్షిణ్యంగా పెరికి వేశాము. యువతీయువకులారా! నిప్పుకు దహనశక్తి, మంచుగడ్డకు చల్లదనము ఎంత ప్రధానమో మానవునికి ప్రేమ అంత ప్రధానము. నిప్పులో దహన శక్తి లేకపోతే అది బొగ్గు అవుతుంది. మంచుగడ్డలో చల్లదనము లేకపోతే అది మట్టిగడ్డ అవుతుంది. అదేవిధంగా మానవునిలో ప్రేమ లేకపోతే అతనికి ప్రాణం లేనట్లే. మానవునికి ప్రేమయే ప్రాణము, ప్రాణమే ప్రేమ. తల్లిదండ్రుల ప్రేమ, భార్యాబిడ్డల ప్రేమ, బంధుమిత్రుల ప్రేమ ఇవన్నీ తాత్కాలికమైనవి; అంతో ఇంతో స్వార్థంతో కూడినవి. దైవప్రేమ ఒక్కటే శాశ్వతమైనది, నిస్స్వార్థమైనది. దానిని పొందాలంటే మనలోని కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే దుర్గుణాలను విసర్జించాలి.

### భగవంతుడు సూత్రధారి, మీరు పాత్రధారులు!

యువతీయువకులారా! భావి ప్రపంచం యొక్క మంచిచెడ్డలు మీ తలవ్రాతపై ఆధారపడియున్నాయి. మీరు మంచి వారైనప్పుడే ప్రపంచము మంచిదౌతుంది. మీరు ఏ గుణములను సాధించలేక పోయినా ఫరవాలేదు, నిర్మలమైన ప్రేమను మాత్రం సాధించండి. భగవత్ప్రేమకు మీరు పాత్రులు కండి, సర్వమూ మీకు లభిస్తాయి. భగవంతుడు సూత్రధారి, మీరు పాత్రధారులు. పాత్రధారులను నడిపించేవాడు సూత్రధారి. మిమ్మల్ని సరియైన పాత్రధారులుగా తయారు చేయాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ యూత్‌కాన్ఫరెన్స్‌ను ప్రారంభించాము. ఈనాడు ప్రపంచాన్ని ఆవరించిన అశాంతిని దూరం చేసి శాంతిభద్రతలు నెలకొల్పడానికి మీరే తగిన సమర్థులు. కనుక పవిత్రమైన భావములను మీ హృదయాలలో నింపుకోండి, తల్లిదండ్రులను గౌరవించండి, దైవాన్ని ప్రేమించండి. ఈ మూడూ మీరు తప్పక చేయాలి.

ఇప్పుడీ సమ్మేళనాన్ని ఎందుకు ఏర్పాటు చేయవలసి వచ్చింది? ఈనాడు తల్లిదండ్రులను బిడ్డలు గౌరవించడం లేదు, బిడ్డల భవిష్యత్తును తల్లిదండ్రులు గుర్తించడం లేదు. విద్యార్థులు అధ్యాపకులను గౌరవించడం లేదు; అధ్యాపకులు కూడా విద్యార్థుల భవిష్యత్తు ఏమిటని ఆలోచించడం లేదు. మిత్రుల మధ్య శత్రుత్వాలు ప్రారంభమవుతున్నాయి, బంధువుల మధ్య సంబంధాలు దూరమవుతున్నాయి. ఇలాంటి పరిస్థితిలో మానవాళిని ఏకం చేయడానికి ప్రేమతత్త్వం ప్రబోధించ వలసియున్నది. ఈ యూనిటీ (ఏకత్వం) ఏర్పడాలంటే పిల్లల హృదయాలలో ప్యూరిటీ (పవిత్రత) ఉండాలి. ప్యూరిటీ ఉండాలంటే డివినిటీ (దైవత్వం) అందులో ప్రవేశించాలి.

### నారు పెట్టిన వాడు నీరుపోయడా?

ప్రేమస్వరూపులారా! ఈనాడు మీరు ప్రేమతత్త్వాన్ని గుర్తించ డానికి ప్రయత్నించండి! రేపటి దినమున ప్రేమతో కూడిన సత్యాన్ని గుర్తించడానికి పూనుకోవచ్చును. ప్రేమ అంటే ఏమిటో, సత్యమంటే ఏమిటో, దైవమంటే ఏమిటో మీరు చక్కగా గుర్తించినప్పుడే మీ జీవితం రాజమార్గంలో ప్రయాణించగలదు. ఏమిటీ నీటిబుడగవంటి దేహానికి, పిచ్చికోతివంటి మనస్సుకు గల సంబంధము? ఏదో మన భ్రాంతిచేతనే ఇన్ని అవస్థలకు గురియైపోతున్నాము. ఈనాటి మానవుని మనస్సు ఏమి చేసినా, ఏమి చూసినా, ఎక్కడికి పోయినా అంతా 'మనీ' పైననే ఉన్నది. 'మనీ' కోసం యువకులు విదేశాలకు బయలుదేరుతున్నారు. మనీ కావాలంటే ఇక్కడే ఉండి సంపాదించుకోవచ్చు కదా! మనీ కావలసిందే, అవసరమే! కాని ఎంతవరకు? మీరు బ్రతకటానికే కదా! మరి ఈ దేశంలో బ్రతకటానికి వీలులేదా? నారు పెట్టినవాడు నీరు పోయడా? భగవంతుడు మీకు రెండు చేతులను, ఒక్క కడుపును ఇచ్చాడు. రెండు చేతులతో పని చేస్తే ఒక్క కడుపు నిండదా? ''హేండ్స్ ఇన్ ది సొసైటీ, హెడ్ ఇన్ ది ఫారెస్ట్'' ఇదే మీరు చేయవలసిన తపస్సు. అప్పుడే మీకు 'రియల్ రెస్ట్' చేకూరుతుంది. అంతేగాని శాంతి, శాంతి అని ఊరికే నోటితో ఉచ్చరిస్తే ఎట్లా చిక్కుతుంది? 'పీస్' (శాంతి) బయట లేదు, మీలోనే ఉన్నది. బయట ఉన్నదంతా పీసెస్, పీసెస్! ఈనాడు అనేకమంది డబ్బులు దండిగా సంపాదించుకొని తామేదో ఎన్‌జాయ్ (Enjoy) చేస్తున్నామనుకుంటున్నారు. ఎన్‌జాయ్ చేయడమంటే భౌతిక సుఖాలను అనుభవించడమా? అది కాదు. ఎన్డ్–జాయ్ (End-Joy)ని మీరు సంపాదించాలి. అనగా అంత్యంలో ఆనందాన్ని అనుభవించాలి.

### ఆపద్బాంధవుడు భగవన్నామమే!

ఒక వ్యాపారి తన నల్గురు కొడుకులకు రామా, కృష్ణా, గోవిందా, మాధవా అని పేర్లు పెట్టాడు. కనీసం ఆవిధంగానైనా

తన అంత్యసమయంలో భగవంతుని తల్చుకోవచ్చునని భావించాడు. నల్గురూ తన దగ్గరే ఉండాలని ఒక పెద్ద షాపు కట్టించి వారికిచ్చాడు. కాని కట్టకడపటికి ఏమయింది? ఒకనాడు తనకు అంత్యసమయం ఆసన్నమైనదని గ్రహించి, రామా! కృష్ణా! గోవిందా! మాధవా! అని తన నల్గురు కొడుకులను పేరుపేరున పిలిచాడు. అందరూ పరుగెత్తుకొని వచ్చి తండ్రి చుట్టూ చేరారు. వారిని చూసి, ''అయ్యో! మీరు నల్గురూ ఇక్కడే ఉంటే షాపు నెవరు చూసుకుంటారు?'' అంటూ ప్రాణం వదిలాడు. చూశారా! మొదటి నుండి హృదయంలో భగవద్భావమును నింపుకొనకపోతే అంత్యసమయంలో భగవంతుడు జ్ఞప్తికి రావాలంటే సాధ్యం కాదు. మనం సంపాదించిన ధనముగాని, గృహముగాని ఏదీ మీనవెంట రాదు.

''బంధువులందరు వాకిటిదాకను
వల్లకాటికే వత్తురుగా
బంధమణచి నిను బాయని
ఆపద్బంధువు భగవన్నామమెరా''

మీ ఇంట వెంట జంట ఉండేది భగవంతుడొక్కడే. కనుక భగవద్భావమును అభివృద్ధి పర్చుకోండి. హృదయంలో భగవద్భావము లేకుండా కేవలం నోటితో రామా, కృష్ణా, గోవిందా అని ఉచ్చరిస్తే ఆ పేర్లను కూడా అవమానించినట్లే అవుతుంది. నోటితో రామా, కృష్ణా, అన్నప్పుడు హృదయం ఎంత పవిత్రంగా ఉండాలి! కాని ఈనాడు కొందరు నోటితో 'డివైన్' అంటారు, చేతలలో మాత్రం 'డీప్-వైన్' లో మునిగిపోతారు! చెప్పిన మాటకు విరుద్ధంగా ప్రవర్తించేవారు మానవులు కారు, రాక్షసులే! ''మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనాం'' సత్య ధర్మశాంతిప్రేమ అహింసలనే మానవతా గుణములు లేనివారు మానవు లెట్లవుతారు? మానవుడు సత్యమునే పలకాలి, ధర్మమునే ఆచరించాలి. ఒకవేళ సత్యం పల్కడానికి ఏదైనా అభ్యంతరం ఏర్పడితే సత్యమూ పలుకవద్దు, అసత్యమూ పలుకవద్దు.

### ఒక్క మంచివాడు చిక్కినా చాలు!

ఈనాడు జగత్తుకు కల్గుతున్న ఆపదలను తొలగించి శాంతిభద్రతలను నెలకొల్పడానికి యువతీయువకులు కంకణం కట్టుకోవాలి. ఈ సమ్మేళనానికి వేలాదిమంది వచ్చారు. ఇందులో ఏ ఒక్కరైనా మంచివారుగా తయారైతే దేశాన్ని ఎంతైనా అభివృద్ధి చేయవచ్చు. దేశాన్ని బాగుపర్చాలంటే వేలాదిమంది అక్కర లేదు. సైనికులు వేలకొలది ఉంటారుకాని, ''కమాండర్-ఇన్-చీఫ్' ఒక్కడే కదా! వివేకానంద తనకు పదిమంది మంచివారు చిక్కితే ప్రపంచాన్నే బాగు చేస్తానన్నాడుకాని నాకు పదిమంది కూడా అవసరం లేదు, ఏ ఒక్క మంచివాడు చిక్కినా చాలు. మంచివాడు ఒక్కడుంటే చాలు, జగత్తును ఎంతైనా మార్చవచ్చు. ఒకటి ప్రక్కన ఎన్ని సున్నలు పెట్టినా విలువ ఎక్కువతుందేకాని, తగ్గదు. 'వన్ ఈజ్ హీరో; వరల్డ్ ఈజ్ జీరో'' హీరో ప్రక్కన ఉంటే జీరోలకు కూడా విలువ పెరిగిపోతుంది. హీరోను తీసివేస్తే మిగిలేదంతా జీరోనే! కాబట్టి ఆ హీరోయే భగవంతుడు. అట్టి భగవంతుని విశ్వసించండి, భగవంతుని ప్రార్థించండి, భగవంతుని ఆశ్రయించండి, భగవంతుని శరణు వేడండి. అదే నిజమైన సాధన. చెప్పినది చేయకుండాపోతే మిమ్మల్ని మీరు వంచించు కున్నవారవుతారు. కనుక చెప్పినది చేయడానికి ప్రయత్నించండి. పల్లెపల్లెయందు, వీథివీథియందు భగవన్నామాన్ని చాటండి. భగవన్నామస్మరణచేత వాతావరణాన్ని పవిత్రం గావించి తద్ద్వారా దేశాన్ని కూడా పవిత్రం గావిస్తారని నేను ఆశిస్తున్నాను.

(తేది : 17.7.97న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

ఎట్టివారికి సేవ సలిపినను దైవానికేయను భావముండవలెను. భగవంతునికి రెండు రూపములున్నవి. అవి లక్ష్మీనారాయణ, దరిద్రనారాయణ స్వరూపములు. లక్ష్మీనారాయణునికి ఎట్టి సేవయు చేయ నక్కరలేదు. పేరునందే తెలియుచున్నది. లక్ష్మి ప్రక్కన ఉండుటచేత లక్ష్మీనారాయణునికి మన సేవలు అనవసరము, కాని దరిద్రనారాయణుడు పేరునందే యున్నట్లు దీనుడు, ఒంటరివాడు. కనుక అట్టి దరిద్రనారాయణునికి సేవ చేయుట అవసరము.

బాబా

# సత్యధర్మాలే దేశాన్ని కాపాడే అస్త్రశస్త్రాలు

దివ్యాత్మ స్వరూపులైన యువతీయువకులారా!

సత్యమే భగవత్స్వరూపము. సిరిసంపదలు, భోగ భాగ్యములు సత్యమునే ఆశ్రయిస్తుంటాయి. యావత్ప్రపంచము సత్యమునే వరించియున్నది. "సత్యాన్నాస్తి పరోధర్మః" సత్య మనే పునాది పైననే ధర్మమనే భవనము ఆధారపడి యున్నది. సత్యమే సర్వులకు మాతృమూర్తి. సత్యమునుండియే మానవుడు ఆవిర్భవించాడు.

"సత్యంబునందుండి సర్వంబు సృష్టించె
సత్యంబునందణగె సర్వసృష్టి
సత్యమహిమ లేని స్థలమేది కనుగొన్న
శుద్ధ సత్వమిదియె చూడరయ్య"

సత్యధర్మములనే విజయము వరిస్తుంది. భుజబల బుద్ధిబల అస్త్రశస్త్రబలము లెన్ని ఉన్నప్పటికీ సత్యధర్మములు లేకపోతే ప్రయోజనం లేదు. సత్యమనగా చూసినది చూసినట్లు చెప్పడం, తలచినది తలచినట్లు చెప్పడం, అనుభవించినది అనుభవించినట్లు చెప్పడం మాత్రమే కాదు. ఎందుకనగా ఈనిమిషములో చూసినది మరొక నిమిషంలో మారవచ్చు. ఒక వ్యక్తి డ్రామాలో రాజువేషం వేశాడు. తెల్లవారేసరికి అతడు సామాన్యమానవునివలె గోచరిస్తున్నాడు. ఇది సత్యమా? అది సత్యమా? ఇప్పుడది సత్యము, అప్పుడది సత్యము. ఈ సత్యము ఆ సత్యమునకు అన్వయించదు, ఆ సత్యము ఈ సత్యమునకు అన్వయించదు. కనుక ఇది తాత్కాలిక సత్యము. దీనినే 'నిజము' అని చెప్పారు.

## సత్యస్వరూపము, అంతరార్థములు

"త్రికాలాబాధ్యం సత్యం " మూడుకాలములందు మారనిదే సత్యము. సత్యము అనే పదము యొక్క అంతరార్థమేమిటి? సత్, ఇ, యమ్ అనే మూడక్షరముల చేరికయే సత్యము. సత్ - అనగా ప్రాణము, ఇ - అనగా అన్నము, యమ్ - అనగా సూర్యుడు. ప్రతి మానవునికి అన్నము అత్యవసరం. సూర్యుడు అన్నమును ప్రసాదిస్తాడు, అన్నము ప్రాణమును పోషిస్తుంది. ప్రాణము, సూర్యుడు ఎన్నటికీ మారవు. ఇవి సత్యస్వరూపములు. దీనిని మరొక విధముగా విచారణ చేయవచ్చును. 'సత్య' అనే పదములో స, త, య అనే మూడక్షరములు ఇమిడియున్నాయి. వీటిని త్రిప్పి చదివినప్పుడు య, త, స అవుతుంది. అనగా యమ నియమాదులచేత తపస్సు ఆచరించినప్పుడు సత్యస్వరూపుడైన భగవంతుడు సాక్షాత్కరిస్తాడని దీని అర్థం. యమ నియమాదులనగా ఇంద్రియాలను నిగ్రహించడం. ఇంక తపస్సనగా ఏమిటి? తలక్రిందకు, కాళ్ళుపైకి పెట్టి ఏదో యోచించడం కాదు. త్రికరణశుద్ధియే నిజమైన తపస్సు. రాగ ద్వేషాదులతో దూషితము కాని హృదయమును, అసత్యాదులతో దూషితము కాని వాక్కును, హింసాదులతో దూషితము కాని కాయమును అభివృద్ధి పర్చుకోవాలి. ఇట్టి త్రికరణశుద్ధి వల్లనే భగవంతుడు సాక్షాత్కరిస్తాడు.

## నైతిక ధార్మిక ఆధ్యాత్మిక విలువలు

ఈనాడు ప్రపంచంలో ఎక్కడ చూసినా శాంతి లేదు. ఎందుచేత? మానవుని కోరికలు మితిమీరిపోయినవి.

"దుష్టసంకల్పములచేత దుఃఖితుడగును
సత్యసంకల్పములచేత సాధువగును
సకల సంకల్పరహితుడే శాంతి పొందు
మరువబోకుడిటువంటి మంచిమాట"

సంకల్పముల చేరికయే మనస్సు. కాబట్టి సంకల్పముల నరికట్టుకున్నప్పుడే మనస్సును సులభంగా అరికట్టుకోవచ్చు.

ముఖ్యంగా మానవుడు సమాజంలో నైతిక ధార్మిక ఆధ్యాత్మిక విలువలను పోషించుకోవాలి. ''సత్యం బ్రూయాత్'', సత్యమునే పలకాలి. ఇది నైతిక విలువ. ''ప్రియం బ్రూయాత్'', ఈ సత్యమును కూడా ప్రియమైన మాటలతో చెప్పాలి, కఠినపదముల నుపయోగించకూడదు. ఇది ధార్మిక విలువ. ఇంక ''నబ్రూయాత్ సత్యమప్రియం'', సత్యమును అప్రియమైనరీతిగా చెప్పకూడదు. ప్రీతి కలిగించాలని అసత్యమాడకూడదు. ఇది ఆధ్యాత్మిక విలువ. కాని ఈ మూడు విలువలను మానవుడీనాడు మరచిపోయాడు. ''సత్యమే దైవం, ప్రేమయే దైవం'' అని బాహ్యంగా బోర్డులమీద వ్రాస్తున్నాడేకాని, అవి తన హృదయంలో కనిపించటంలేదు.

### శ్రమలేని సాధన

యువకులారా!

మీరు అనేక చదువులు చదివి ఉద్యోగాలలో ప్రవేశించి ధనమును సంపాదిస్తున్నారు. అయితే సంపాదించిన ధనమును ఏవిధముగా వినియోగిస్తున్నారు? సద్వినియోగం చేస్తున్నారా? దుర్వినియోగం చేస్తున్నారా? ఈ ప్రశ్నను ఎవరికి వారు వేసుకోవాలి. కోరికలపై అదుపు (Ceiling on desires)లో భాగంగా కాలమును, ఆహారమును, ధనమును, శక్తిని వ్యర్థం చేయకూడదు. చెడు వినవద్దు, చెడు అనవద్దు, చెడు కనవద్దు, చెడు తలచవద్దు, చెడు చేయవద్దు. మంచినే వినండి, మంచినే అనండి, మంచినే కనండి, మంచినే తలచండి, మంచినే చేయండి. ఇదే మీరు చేయవలసినది. దీనికి పెద్దగా శ్రమ పడనక్కర లేదు. ధ్యానం చేయాలనీ, భజనలు చేయాలనీ, పల్లెలకు వెళ్ళి సేవలు చేయాలనీ మీ రిపోర్టులో చెప్పారు. ఇవన్నీ శ్రమతో కూడినవి. ఏ శ్రమయు లేకుండా ఏ పని చేసినా, ఏ మాట చెప్పినా, ఎక్కడికి వెళ్ళినా సర్వమూ భగవత్ప్రీత్యర్థమనే భావనను హృదయంలో ప్రతిష్ఠ చేసుకున్నప్పుడు ఇంకవేరే సాధన అవసరం లేదు. అయితే ఇంతటి పవిత్ర భావము అంత సులభంగా రాదు. కనుక దానికోసం ధ్యానము, భజన, జపము ఇత్యాది సత్కర్మలను ఆచరించాలి.

### జీవితవిధానమే ధ్యానము

మన జీవితమంతా మెడిటేషన్ (ధ్యానము) తో కూడినదే. Meditation is way of life. ఇది మన జీవనవిధానానికి సంబంధించినది. నడిచే సమయంలో త్రోవను చూసుకోకుండా నడిస్తే ప్రమాదాలకు గురియౌతాము. కనుక నడకకు కూడాఏకాగ్రత (Concentration) అవసరమే. నడవటం, మాట్లాడటం, చదవటం, వ్రాయటం మున్నగునవన్నీ ఏకాగ్రతతో కూడినవే. అయితే మీరు వస్తువులపై, విషయాలపై పెట్టే ఏకాగ్రతను భగవంతునిపై త్రిప్పితే మీలో దివ్యమైన మార్పు కల్గుతుంది. అప్పుడు మీరు చేసే ప్రతి పని దైవారాధనగా మారుతుంది. అదేమెడిటేషన్! మీ దృష్టిని, మీ భావమును ప్రకృతి నుండి పరమాత్మవైపు మరల్చాలి. పని వేరు, పూజ వేరు కాదు. ప్రకృతి వేరు, పరమాత్మ వేరు కాదు. జీవుడు వేరు, దేవుడు వేరు కాదు. దివ్యత్వం మీయందే ఉన్నదనే విశ్వాసాన్ని మీరు అభివృద్ధి పర్చుకున్నప్పుడు ఇంక మీరు తప్పులు చేయటానికి ఏమాత్రము పూనుకోరు. మీ జీవిత భవనమునకు ఆత్మవిశ్వాసమే పునాది. అయితే మీరు భవనమునకు అనేక అలంకారములు చేస్తున్నారు కాని పునాది గూర్చి పట్టించుకోవడం లేదు. పునాది లేక భవనమే లేదు కదా! ఆత్మవిశ్వాసమనే పునాది లేక ఆత్మసంతృప్తి అనే గోడలు నిర్మించ లేరు. ఆత్మసంతృప్తి అనే గోడలు లేక స్వార్థత్యాగమనే పై కప్పు వేయలేరు. ఈ నాలుగూ ఉన్నప్పుడే మీరు ఆత్మసాక్షాత్కారాన్ని పొందగలరు.

మనిషిని ఇంగ్లీషులో **MAN** అన్నారు. M అనగా మనస్సు లేక, మాయ. దీనిని వశపర్చుకోవాలి. A అనగా ఆత్మతత్వం. దీనిని అర్థం చేసుకోవాలి. అప్పుడే N అనగా నిర్వాణము చేకూరుతుంది. ఈ నిర్వాణముకోసమే బుద్ధుడు అనేక సాధనలు సల్పాడు. కట్టకడపటికి, ''అయ్యో! అంతా నాలోనే ఉండగా ఇంతకాలమును వ్యర్థం చేసుకున్నానే!'' అని విచారించాడు.

### మానవతా విలువలే పంచప్రాణాలు

సర్వమూ మానవునియందే ఉన్నది. కాని ఈనాటి మానవుడు తనను తాను మర్చిపోయాడు. ఈనాడు లోకములో ప్రతిపదార్థమునకు వెల పెరిగిపోతున్నదిగాని మానవునికే విలువ లేకుండా పోయింది. ఎందుచేతనంటే మానవుడు తన మానవతా

విలువలను పోగొట్టుకున్నాడు. సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలనే మానవుడు తన పంచప్రాణములుగా భావించాలి. సత్యము నీలో లేకపోతే ఒక ప్రాణము పోయినట్లే! ధర్మము లేకపోతే రెండవప్రాణం కూడా పోయినట్లే! ఈ పంచప్రాణములూ నీలో లేకపోతే నీవొక డెడ్-బాడీ (శవం)తో సమానం.

## చైతన్యమే ఆత్మతత్త్వం

దేవుడనేవాడు ఉంటే కంటికి ఎందుకు కనిపించడు? అని ఆధునిక విద్యార్థులు ప్రశ్నిస్తారు. నీ చుట్టు గాలి ఉన్నదని నీవు విశ్వసిస్తున్నావా? విశ్వసించక తప్పదు. ఎందుకంటే గాలిలేక నీవు ఉండలేవు. మరి ఆ గాలిని చూడగల్గుతున్నావా? పట్టగల్గుతున్నావా? వీలుకాదు. కాని గాలి ఉన్నదని మాత్రం విశ్వసిస్తున్నావు. అదేవిధంగా దేవుడు చైతన్యస్వరూపుడై సర్వత్ర ఉన్నాడు. అతడు లేక నీవు లేవు. అయితే కంటికి కనిపించడు, చేతికి చిక్కడు. ఈ చైతన్యము (కాన్షియస్‌నెస్) మానవునిలోను, సకల జీవరాసులలోను ఉన్నది. అయితే క్రిమికీటకాదులు, పశుపక్షిమృగాదులు తమయందు కాన్షియస్‌నెస్ ఉన్నదనే సత్యాన్ని గుర్తించుకోలేవు, ఒక్క మానవుడు మాత్రమే దీనిని గుర్తించ గల్గుతున్నాడు. ఈ కాన్షియస్‌నెస్ నుండి వచ్చినదే కాన్షియన్స్ (అంతరాత్మ). ఇది దేహములో నఖశిఖ పర్యంతము సంచరిస్తున్నది. ఈ కాన్షియన్స్‌నుండి వచ్చినదే కాన్షియస్. ఇది ఇంద్రియములకు సంబంధించినది.

## మనస్సు - అంతరాత్మ

మానవత్వమును అర్థం చేసుకోవాలంటే మొట్టమొదట మనస్సు యొక్క తత్వాన్ని చక్కగా విచారించాలి. తరువాత ఆత్మతత్వంలో ప్రవేశించాలి. అయితే మనస్సు అంత సులభంగా చిక్కదు. సంకల్పముల నుండి కోరికలు బయలు దేరుతున్నాయి. దారముల చేరిక చేత వస్త్రము ఏర్పడినట్లుగా కోరికల చేరిక చేత మనస్సు రూపొందుతున్నది. దారములను తీసివేస్తే వస్త్రము లేదు. అట్లే కోరికలను తీసివేస్తే మనస్సు ఉండదు. అసలు కోరికలకు మూలం సంకల్పములే కాబట్టి చెడుసంకల్పములకు చోటివ్వకుండా చూసుకోవాలి. దారము నలుపైతే వస్త్రము కూడానలుపుగానే ఉంటుంది. కనుక మన మనస్సు మాలిన్యంగా ఉన్నదంటే మన సంకల్పములు మాలిన్యంగా ఉన్నాయన్నమాట. అటువంటప్పుడు ఆత్మవిమర్శ చేసుకోవాలి. ఇది తప్పా ఒప్పా? ఇది మంచిదా కాదా? అని విచారణ సల్పి నీ కాన్షియన్స్ (అంతరాత్మ) చెప్పిన ప్రకారము నడుచుకోవాలి. నీవు చేసే పని తప్పు అని నీకు తోచినప్పుడు నీవా పని ఎందుకు చేయాలి? నీ కాన్షియన్స్‌కు నచ్చని పనులలో నీవేమాత్రము ప్రవేశించవద్దు.

## విజ్ఞానశాస్త్రంవల్ల ఇంద్రియలోలత్వం

విద్యార్థులారా! యువకులారా! యువతులారా! ఈనాడు దేశాన్ని పవిత్రంగా తీర్చిదిద్దడానికి మీరే సమర్థులు. మీరు కాపాడవలసింది దేశాన్ని కాదు, సత్యధర్మాలను కాపాడితే చాలు, అవే దేశాన్ని కాపాడుతాయి. ఈనాడు సైన్స్ అండ్ టెక్నాలజీ అభివృద్ధి చెందడంచేత ఆధ్యాత్మికమంటే హాస్యాస్పదంగా కనిపిస్తున్నది. మీరు దేనిని టెక్నాలజీ అని భావిస్తున్నారో అదంతా 'ట్రిక్-నాలెడ్జ్' అనే చెప్పవచ్చు. అది అప్పటికప్పుడు ఆనందము నందించినా తదుపరి దానివల్ల ఎన్నో ప్రమాదాలు సంభవిస్తున్నాయి. మన పూర్వీకులు ఏవిధంగా బ్రతికారు? వారికి అశాంతి అంటే, భయమంటే ఏమిటో తెలియదు. కారణమేమిటి? వారు సత్యధర్మముల నాశ్రయించారు. ఈనాడు ఎంతటి మేధావికైనా, ఎంతటి విద్యావంతునికైనా క్షణక్షణమూ భయం, భయం! సైన్స్ ఎంత పెరిగిపోయిందో సెన్సెస్ (ఇంద్రియాలు) అంత దిగజారిపోయినవి. దీనిని గూర్చి మీరు యోచన చేయడం లేదు. సైన్సుకు, ఆధ్యాత్మికమునకు ఉన్న వ్యత్యాసమును మీరు గుర్తించాలి. ఆధ్యాత్మిక మనేది ఫుల్‌సర్కిల్ (వృత్తము) వంటిది. ఇది ఎక్కడ ప్రారంభమవుతుందో తిరిగి అక్కడే వచ్చిచేరుతుంది. ఇది పూర్ణంగా ఉంటుంది. కాని సైన్సు సెమీసర్కిల్ (అర్ధవృత్తము) వంటిది. ఇది ఒకచోట ప్రారంభమై మరొకచోట నిలిచిపోతుంది; మధ్యలో అగాధమైన అశాంతి ఇమిడి యున్నది.

## సత్యధర్మాలే భారతీయుల అస్త్రశస్త్రాలు

ఈనాటి అశాంతికి మూలకారణం ఈ సైన్సే! దేనికైనా ఒక పరిమితి ఉండాలి. సైన్సు, టెక్నాలజీ చాల అవసరమే. కాని ఇవి మితిమీరిపోవడం చేత ఆటమ్‌బాంబులు, హైడ్రోజన్‌బాంబులు

అభివృద్ధి అవుతున్నాయి. ఇవన్నీ మనిషిని చంపడానికి, భయపెట్టడానికి చేసే ప్రయత్నములే. కీడు కీటకమైనా చేయగలదు. చంపడానికి ఇన్ని కోట్లు ఖర్చు పెట్టి ఇంత పెద్ద బాంబులను తయారుచేయవలెనా?! వీటికి ఖర్చు పెట్టే ధనమును ప్రజాసంక్షేమంకోసం వినియోగిస్తే ఎంత బాగుంటుంది! ఒక దేశపు వారిని చూసి మరొక దేశపు వారు పోటీలమీద బాంబులను తయారు చేస్తే ప్రపంచమే భస్మమైపోతుంది. అమెరికా, రష్యాలు అనేక అస్త్ర శస్త్రములను తయారు చేస్తుంటే భారతదేశం మాత్రం ఏమీ చేయటం లేదే! అనుకుంటున్నారు చాలమంది. ఇది చాల పొరపాటు. అనేక అస్త్రశస్త్రములను సంపాదించిన అమెరికా అర్జునునివంటిది. భుజబల బుద్ధిబలములు కల్గిన రష్యా భీముని వంటిది. ఈ భారతదేశము ధర్మజుని వంటిది. భీమార్జునులు నిరంతరము ధర్మజుని ఆజ్ఞకు లోబడే ఉంటారు కదా! కనుక ఈనాడు మనం ధర్మమును అభివృద్ధి చేస్తే, భీమార్జునులు ధర్మజుని అనుసరించినట్లుగా, అందరూ మనకు శరణాగతులౌతారు. మనం ఎవ్వరినీ హింసించకూడదు. ''అహింసా పరమో ధర్మః'' ఈ ధర్మాన్ని అనుసరిస్తే మనకింక ఏ బాంబులుగాని, ఏ అస్త్రశస్త్రములుగాని అవసరం లేదు.

అన్ని దేశాలవారికి సత్యము ఒక్కటే. అమెరికన్ సత్యము, రష్యన్ సత్యము, పాకిస్తాన్ సత్యము అనే భేదము లేదు కదా! కాబట్టి ఏ దేశమువారైనా సత్యధర్మాలను అనుసరిస్తే ప్రపంచంలో కలతలు, కల్లోలములు ఉండవు. ఈనాడు అనేకమంది సత్యధర్మాలను ప్రచారం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. లేని వస్తువుకైతే ప్రచారమవసరంకాని సర్వత్ర ఉన్న సత్యధర్మములకు ప్రచారమెందుకు? ప్రచారం కంటే ఆచరణ అత్యావసరం. ప్రచారంలో కాలమును వ్యర్థం చేయడం నాకిష్టం లేదు, ఒక్క దానిని మనం ఆచరిస్తే చాలు.

**మాటలు తక్కువ, పని ఎక్కువ చేయాలి**

ముఖ్యంగా సత్యాన్ని పోషించాలంటే, ధర్మాన్ని కాపాడాలంటే మిత భాషణను అలవర్చుకోవాలి. రేడియోలో ఒక అర్ధగంట పాటలు విన్నామంటే ఎన్నో యూనిట్ల కరెంటు ఖర్చవుతుంది కదా! మన దేహం కూడా రేడియోవంటిదే! కనుక మనం అమితంగా మాట్లాడితే ఎంతో శక్తిని వ్యర్థం చేసిన వారమవుతాము. కొంత అసత్యం కూడా అందులో ప్రవేశించవచ్చు. కనుక తక్కువ మాట్లాడండి, ఎక్కువ పని చేయండి. మీ శక్తిని మంచికి ఉపయోగించాలి. కాని మీరు దుష్ట భావములతోను, దుష్టచేష్టలతోను దానిని వ్యర్థం చేస్తున్నారు. ఈనాడు మానవ జీవిత ప్రమాణం తగ్గిపోవడానికి మూలకారణం సత్య ప్రేమలు సన్నగిల్లడమే!

***దుస్సాంగత్యం వద్దు***

అన్నింటికీ ప్రేమయే ప్రధానమైనది. ప్రేమతో ఏది పలికినా అది సత్యమవుతుంది. ప్రేమతో ఏది చేసినా అది ధర్మమవుతుంది. కాని ఈనాడు మీ ప్రేమను మీరు పెడమార్గంలో ప్రవేశపెడుతున్నారు. ఒకే కళ్ళు తల్లిని చూస్తున్నాయి, భార్యను చూస్తున్నాయి, కుమార్తెను చూస్తున్నాయి, కోడల్ని చూస్తున్నాయి. అయితే ఎవరిని ఏవిధంగా చూడాలి? ఇదే సత్యాన్వేషణ. మీ సోదరిని పరాయిపిల్లలు చెడుదృష్టితో చూసినప్పుడు మీకెంత కష్టం వేస్తుంది! అదేవిధంగా మీరు పరస్త్రీలను చెడుదృష్టితో చూస్తే వారి సోదరులకు కూడా అంత బాధ కల్గుతుందని గుర్తించాలి. ఏ కష్టము నీకు కల్గకూడదని ఆశిస్తావో ఆ కష్టము ఎదుటివారికి కూడా కలుగకుండా చూసుకోవాలి. అయితే మీరు మంచివారే! కాని సంగదోషమువల్ల చెడిపోతున్నారు. ఐన్‌స్టీన్ మారణాస్త్రముల తయారీలో సహకరించి కావలసినంత ధనం సంపాదించాడు. కాని చివరికి తన పొరపాటును గుర్తించాడు. ''ఛీ! ఈ సామగ్రి ఎంతమంది ప్రాణాలను తీస్తుందో ఏమిటో! సంగదోషంచేత నేను నా విద్యను పెడమార్గంలో ప్రవేశపెట్టానే!'' అని బాధపడ్డాడు. అప్పుడే భగవద్గీత తీసి చెప్పాడు: Tell me your company, I shall tell you what you are అని. మీరు ఎలాంటి వారితో చేరతారో మీలో అలాంటి బుద్ధులే పుడుతుంటాయి. కనుక సత్సంగములో చేరడం అత్యవసరం. సత్సంగమునగా భజనలు చేసే భక్తులని కాదు. 'సింగర్స్'లో కూడా 'సిన్నర్స్' ఉండవచ్చు. ఎవరు మంచో, ఎవరు చెడ్డో చెప్పలేము. వేదాంతమునందు సత్ – అనగా దైవము. కనుక మనం దైవంతో స్నేహం చేయాలి. అదే సత్సంగము.

ఒకానొక సమయంలో గాంధీ విదేశాలకు వెళ్ళడానికి తల్లి పుతలీబాయి అభ్యంతరం చెప్పింది. కాని గాంధీ తాను వెళ్ళి తీరవలసిందేనని పట్టు పట్టాడు. అప్పుడామె అతనిచేత ఒక వాగ్దానం చేయించుకుంది. ఏమిటది? మద్యము, మాంసము, మగువ - ఈ మూడింటి జోలికి పోనని వాగ్దానం చేయమని చెప్పింది. అనగా ఆనాటి తల్లులు తమ పిల్లలు విదేశాలకు వెళితే సంగదోషంవల్ల చెడిపోతారేమో నని భయపడేవారు. కాని ఈనాటి తల్లులు మాత్రం ఆవిధంగా లేరు. ''నాయనా! పరీక్షలో పాసైనావా! అయితే ఇంక ఫారిన్ పోవడానికి టికెట్ బుక్ చేయ్'' అంటారు. ఇది చాల పొరపాటు. ఎవరి దేశంలోవారు ఉండి తమ దేశాన్ని తాము రక్షించుకోవాలి, తమ దేశానికి తాము సేవ చేసుకోవాలి. అల్లని ఇతర దేశములపట్ల భేద భావానికి తావీయకూడదు.

## ఒకే ప్రపంచం, ఒకే మానవకులం

మానవులందరిదీ ఒక కులమే, ప్రపంచమంతా ఒక గృహమే. ఇందులో ఒక్కొక్క దేశము ఒక్కొక్క రూమ్ మాదిరి ఉన్నది. రూములు వేరైనా ఇల్లు ఒక్కటే. ఏ దేశీయులైనా అందరూ అన్నదమ్ములే. కనుకనే గోల్డ్‌స్టీన్ తన ప్రసంగంలో రెండు వేలమంది డెలిగేట్స్ వచ్చారని అన్నప్పుడు నేను ఖండించాను. ఈ రెండు వేల మంది విదేశముల నుండి వచ్చినవారే. ప్రపంచంలో ఇండియా కూడా ఒక భాగమే కదా! మరి ఇండియన్ డెలిగేట్స్ గురించి తానెందుకు చెప్పలేదు? అందరూ ఒక ఇంటివారే. అందువల్లనే జీసస్ చెప్పాడు : All are one My dear son, be alike to every one. అందరూ ఒక్కటే. అందరిపట్ల సమత్వాన్ని వహించాలి.

## మతము - ఆధ్యాత్మికము

ఆధ్యాత్మిక మనేది ఒక రెలిజియన్ (మతము) కాదు. అన్ని దేశములకు ఆధ్యాత్మికము అత్యవసరమే. చాలమంది తమ నివేదికలతో రెలిజియన్ (మతము)ను గూర్చి ప్రస్తావించారు. అసలు రెలిజియన్ అనగా ఏమిటి? ''టు రియలైజ్ ఈజ్ రెలిజియన్'' అనగా తనను తాను తెలుసుకోవాలి. 'నేను' ఎవరో గుర్తించాలి. ఈ అర్థాన్ని తీసుకోకుండా ఈనాడు రెలిజియన్ పేరుతో హిందువులని, ముస్లింలని, పర్షియన్లని, క్రైస్తవులని మానవులను విభజిస్తున్నారు. నాకీ భేదము లేనే లేదు. అందరూ ఒక్కటే. ఇట్టి ఏకాత్మభావాన్ని మీరు పెంచుకోవాలి. ప్రేమ ఉంటే ఏకాత్మభావం సులభంగా అలవడుతుంది.

## ప్రశాంతి నిలయమొక వర్క్‌షాప్!

యువకులారా! యువతులారా! మీరు ఇక్కడకు వచ్చినందుకు చేయవలసిన దేమిటంటే - మీ దుర్గుణాలను, దుష్టప్రవృత్తులను ఇక్కడ వదలిపెట్టి సద్గుణములను, సద్భావములను, సత్కీర్తిని తీసుకొని పొండి. ఇంతకు మించి నేను మిమ్మల్ని ఏమీ కోరటంలేదు. చెడును ఇక్కడ వదలి పెట్టండి, మంచిని తీసుకు పొండి. ప్రశాంతి నిలయమొక వర్క్‌షాప్‌వంటిది! మీ దేహములనే కార్లు చాల చెడిపోయి వచ్చినాయి. బోల్టులు, నట్‌లు, స్క్రూలు అన్నీ చెడిపోయినాయి. ఈ వర్క్ షాప్‌కు వచ్చినందుకు మీరు క్రొత్త బోల్టులు, క్రొత్త నట్‌లు, క్రొత్త స్క్రూలు, క్రొత్త టైర్లు వేసుకొని క్రొత్త కార్లలా బయటికి వెళ్ళాలి. వర్క్ షాప్‌కు వచ్చిన కారు రిపెయిర్ లేకుండా వెళితే ప్రయోజన మేమిటి? కనుక ఇక్కడికి వచ్చినందుకు మీ తేజస్సులోను, మీ ప్రవర్తనలోను, మీ భావములలోను మంచి మార్పును కనబర్చాలి. అప్పుడు మీ తల్లిదండ్రులు కూడా మిమ్మల్ని చూసి ఆనందిస్తారు.

## తల్లిదండ్రుల మనస్సు నొప్పించకండి

ఎవ్వరినీ కఠినమైన మాటలతో బాధించ కూడదు. మీరు మొట్టమొదట నేర్చుకోవలసింది ఇదే! తల్లి వచ్చి, ''ఎక్కడికి వెళ్ళావు నాయనా!'' అని అడిగితే ''నీకెందుకు?'' అని కఠినంగా మాట్లాడవద్దు. ''అమ్మా! నేను ఫలానాచోటుకు వెళ్ళి వచ్చాను'' అని మధురంగా మాట్లాడు. ఇక్కడి నుండి వెళ్ళిన తరువాత ఇక్కడి సమాచారమును మధురమైన మాటలతో, వినయవిధేయతలతో తల్లికి చెబితే ఆమె ఎంతో ఆనందిస్తుంది. కొంతమంది కఠినమైన మాటలతోతల్లిదండ్రుల మనస్సును కష్టపెడుతుంటారు. అది చాల తప్పు. తల్లిదండ్రులకు మొట్టమొదట కృతజ్ఞత నందించాలి. నీవు నీభార్యను సెలెక్ట్ చేసుకోవచ్చుగాని నీతల్లిని సెలెక్ట్ చేసుకోలేవు. నీకంటే ముందు పుట్టినది తల్లి, నీ తరువాత పుట్టినామె నీభార్య. కనుక నీ భార్యను, నిన్ను పెంచి పోషించిన

తల్లిని సమానంగా చూడకూడదు. అయితే నీవ్యక్తిగత విషయంలో నీసంబంధాన్ని నీవు చూసుకోవచ్చుగాని కుటుంబ విషయంలో మాత్రం తల్లికి మొట్టమొదట గౌరవ మివ్వాలి. నీవు నీ తల్లిదండ్రులలో మాత్రమే గాక నీ బంధువులలోను, నీ మిత్రులలోను సరియైన మార్పు తెప్పించాలి. ఇదే నీవు చేయవలసిన సేవ. సేవ అంటే ఏమిటి? మంచిని పదిమందికి చేయడమే సేవ. ఇదే స్వామి యొక్క ఆశయం. నాకింకేమీ అక్కర లేదు.

## స్వాముల విదేశాలమోజు

ఇక్కడ మీకు ఇంకోవిషయం చెప్పాలి. చాలమంది, ''స్వామీ! మా దేశానికి రండి'' అని ఆహ్వానిస్తున్నారు. కాని నాకు అది ఇష్టం లేదు. ఎవరైనా సరే, మొట్టమొదట తన ఇంటిని తాను చక్కదిద్దుకొని తదుపరి పరాయి ఇంటికి వెళ్ళి బోధించాలి. అప్పుడే వాళ్ళు చెప్పినమాట వినడానికి వీలౌతుంది. కనుక భారతదేశంలో ఉన్నవారు మొట్టమొదట భారతీయులకు తగిన శక్తిసామర్థ్యములు సమకూర్చి తదుపరి మరొక దేశమునకు వెళ్లాలి. ఇప్పుడు చాలమంది స్వాములకు ఇలాంటి భావము లేదు. ఈనాడు అనేకమంది స్వాములు భారతదేశము నుండి విదేశములకు వెళుతున్నారు. ధనము కావాలంటే ముందు విదేశాలకు పాస్‌పోర్ట్ తీసుకుంటారు. ఇలాంటివారు బిగ్గర్లో లేక బెగ్గర్లో మీరే యోచన చేసుకోవచ్చు. అమ్మలు, స్వాములు అందరూ వెళుతున్నారు విదేశాలకు, స్వామిపేరు చెప్పుకొని అనేక రకములుగా భిక్షమెత్తుతున్నారు. ఇది చాల తప్పు. ఇలాంటివారిని మీరు విశ్వసించకండి. అలాంటి ఆశ స్వామికి ఎప్పుడూ లేదు. స్వామి కోరేది ఒక్కటే – మీరు అభివృద్ధికి రావాలి, దేశం బాగుపడాలి. ఈవిషయాన్ని కూడా మీరు మీ దేశములలో చాటాలి. నిజంగా గొప్పవారైతే ముందు తమ దేశాన్ని తాము బాగుపర్చుకుంటారు, తమ ఇంటిని తాము చక్కదిద్దుకుంటారు. ఆహా! ఈనాడు భారతదేశంలో జరుగుతున్న విచిత్రమేలాంటిదో తెలుసునా? ఒక ఇంటి యజమానికి వడలు, పాయసం తినాలని ఆశపుట్టి భార్యతో,'' ఈ దినము మా పెద్దనాన్న తద్దినము. కాబట్టి వడలు, పాయసము చేయి'' అన్నాడట. అదేవిధంగా కొందరు స్వాములు డబ్బు ఎప్పుడు కావాలంటే అప్పుడు అమెరికాకో, జర్మనీకో, ఇటలీకో బయలుదేరుతున్నారు. ఇది చాల తప్పు. ఇది పాములు చేసే పనేకాని, స్వాములు చేయవలసిన పని కాదు. రెండు నాలుకలుండేది పాములకే! ఇలా అసహ్యంగా, అసభ్యంగా ప్రవర్తించేవారిని ఏమాత్రము చేరదీయకండి.

## సాయి ప్రేమాకర్షణశక్తి

పవిత్రమైన భావాలు కల్గినవారు ఎక్కడికీ పోనక్కరలేదు, తమవద్దకే ఇతరులను రప్పించుకోవచ్చు. మీరందరూ ఎంతో ప్రేమతో ఇక్కడికి వచ్చారు కదా! మీకేమైనా ఇన్విటేషన్ పంపించామా? బెల్లం దగ్గర చీమలు చేరినట్లుగా మీ ప్రేమకొద్దీ మీరిక్కడకు వచ్చారు. ఈ 'తీపి' రుచి ఎరిగిన మీకు ప్రయాణం శ్రమ అనిపించదు. చీమలంతా బెల్లము దగ్గరికి రావాలికాని, బెల్లము చీమల దగ్గరికి పోదు. బెల్లమే చీమల దగ్గరికి పోతున్నదంటే అది నిజమైన బెల్లము కాదు, కృత్రిమమైనదన్న మాట! ప్లాస్టిక్ ద్రాక్షపళ్ళు చూడటానికి అచ్చం ద్రాక్షపళ్ళ మాదిరిగానే ఉంటాయి. కాని అందులో తీయని రసము ఎక్కడా కనిపించదు. ప్లాస్టిక్ కమలములు కూడా అంతే! వాటిపైనేమైనా తుమ్మెదలు వచ్చి వ్రాలుతాయా? వ్రాలవు. ఎందుకంటే వాటిలో మకరందము లేదు కనుక. పుష్పములు తుమ్మెదలను తమవద్దకు ఆహ్వానించవు. ఆ పుష్పములలోని మకరందంకోసం తుమ్మెదలు తమంతట తామే వచ్చి వాటిపై వ్రాలుతుంటాయి. కనుక మనలో నిజంగా ప్రేమ ఉంటే అదే అందరినీ ఆకర్షిస్తుంది. కనుక మీరు ప్రేమస్వరూపులుగా తయారై, ప్రేమచేత జగత్తులోని అశాంతిని, భయభ్రాంతులను దూరం చేయండి. ఈనాడు ఏ దేశంలో చూసినా Law & order లేనే లేదు. కనుక మీరు మీమీ దేశాలలో ఈ పవిత్రభావములను గూర్చి ప్రచార ప్రబోధలు సల్పి మీరు కూడా ఆనందాన్ని పొందండి. నాకు పేరు ప్రతిష్ఠలు కావాలనే ఆశ లేదు. మీరు మంచిని చేసినప్పుడే మంచిని పొందుతారు. కనుక పవిత్రమైన కర్మలచేత మానవత్వాన్ని సార్థకం చేసుకోండి. సత్యధర్మములను అర్థం చేసుకొని సాధ్యమైనంతవరకు ఆచరణలో పెట్టండి.

*(తేది : 18.7.97 సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీ సత్యసాయి ప్రథమ ప్రపంచ యువజన సమ్మేళనం ముగింపు సందర్భంగా శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

# దైవానికి దాసులు కండి, ధనానికి కాదు

''తిలలలో తైలము, పాలలో వెన్న, పుష్పంలో సుగంధం, ఫలంలో రసం, కట్టెలో నిప్పు ఉన్నట్లు మాధవుడు జగత్తులోను, మానవదేహంలోను చైతన్యస్వరూపుడుగా ఉంటున్నాడు. చైతన్యమును ఆవిర్భవింపచేసే నిమిత్తమై మూర్తీభవించినవాడే మానవుడు.''

ప్రకృతిలో సత్వరజస్తమో గుణము లుండినట్లుగా మానవునిలో మూడు గుణములు ప్రధానంగా ఉండాలి. మొదటిది డివోషన్ (భక్తి); రెండవది డిసిప్లిన్ (క్రమశిక్షణ); మూడవది డ్యూటీ (కర్తవ్యపాలన). యువతీ యువకులారా! మీరందరూ చాల మంచివారే. కాని క్రమశిక్షణను కూడా మీరు గుర్తించి వర్తించాలి. ముఖ్యంగా కాలము వ్యర్థం కాకుండా చూసుకోవాలి. ఏదైనా సమావేశంలో పాల్గొన్నప్పుడు చిత్రమునకుగాని, విచిత్రమునకుగాని అన్నింటికీ ఊరకే చప్పట్లు కొట్టకూడదు. దీనివల్ల ఎంతో టైమ్ వ్యర్థమైపోతున్నది, ఈ చప్పట్లకు కూడా విలువ లేకుండా పోతున్నది. మానవుడనగా విలువైనవాడని అర్థం. కనుక మీరు చేసే ప్రతి పనికి విలువ ఉండాలి. ఈనాటి యువతకి సమావేశములలో పోయి కూర్చోవడం, నాయకులు మాట్లాడిన ప్రతి మాటకు చప్పట్లు కొట్టడం అలవాటైపోయింది. ఇది మంచిది కాదు. ప్రతి సెకండును చాల పవిత్రంగా వినియోగించుకోవాలి.

### శీలం ప్రాణసమానం

ఈ వయస్సులో మీకు చాల ప్రధానమైనది, ప్రాణసమానమైనది – శీలము (character). మొక్క చక్కగా ఉన్నప్పుడే చెట్టు చక్కగా ఉంటుంది. కనుకనే START EARLY, DRIVE SLOWLY, REACH SAFELY అని చెప్పాను. ఇది గోల్డెన్ ఏజ్! ఇలాంటి పవిత్రమైన వయస్సులో చెడమార్గం పడితే జీవితమే నాశనమై పోతుంది. కనుక ఈ వయస్సును అతి జాగ్రత్తగా వినియోగించాలి. ఏ దేశమువారైనా క్రమశిక్షణ, శీలము – ఈ రెండింటినీ తమ రెండు నేత్రములుగా భావించాలి. అమెరికావారు ఏవిధంగా ప్రవర్తించాలి? రష్యావారు ఏవిధంగా ప్రవర్తించాలి? జర్మనీవారు ఏవిధంగా ప్రవర్తించాలి? అనే ప్రశ్నలు మనకు అవసరం లేదు. ఏ దేశంవారైనా అందరూ మానవులే కదా! మానవకులము, ప్రేమమతము, హృదయ భాష ఈ మూడింటి తత్వాన్ని గుర్తించినప్పుడు ఏ దేశమువారైతే మనకేమి? ఏ దేశమువారైనా శీలమును ప్రాణసమానంగా కాపాడుకోవాలి. ప్రాచీన మహర్షులు, ప్రాచీన యువకులు తమ శీలమును కాపాడుకోవడం చేతనే చరిత్రకారకులుగా రూపొందినారు. హిస్టరీ అనగా ఏమిటి? His story is History. ఎవరి స్టోరీ? శీలవంతుని స్టోరీయే హిస్టరీ. కనుక మనం చరిత్రకారకులుగా రూపొందాలంటే మన శీలసంపత్తిని కాపాడుకోవాలి. ఈనాడు ప్రపంచము సరియైన స్థితిలో లేదంటే అది వ్యక్తిదోషమే! మీరు అధికంగా మాట్లాడటంవల్ల కూడా శీలము కొంత దెబ్బతింటుంది. శీలము లేనివారిని చూస్తే పూర్వకాలంలో పామును చూసినట్లుగా బెదరి పారిపోయేవారు.

### రామలక్ష్మణుల పవిత్రాదర్శం

రామాయణంలో ఒక చిన్న ఉదాహరణ : రాముడు శివధనుస్సు విరిచిన తరువాత అతనికి సీత నిచ్చి వివాహం చేయడానికి సిద్ధమయ్యాడు జనకమహారాజు. దానికి పూర్వం రాముడు సీతను ఒక్క క్షణమైనా చూసి ఎరుగడు. వివాహము కాక పూర్వము ఆమె పరస్త్రీ. పరస్త్రీని కన్నెత్తి చూడకూడదు. ఇది శ్రీరామచంద్రుని యొక్క పవిత్రాదర్శము. పెండ్లిపీటలమీద కూర్చున్నప్పుడు సీత ఎడమ భాగంలో ఉంటే రాముడు కుడివైపు చూస్తున్నాడు. ప్రక్కనే ఉన్న జనకమహారాజు, ''రామా! సీత

ఇక్కడ ఉన్నది. నీవెక్కడో చూస్తున్నావేమిటి?'' అని అనేక పర్యాయములు చెప్పాడు. కాని రాముడు లెక్క చేయలేదు. కారణమేమిటి? తాను అప్పటికి ఇంకా మంగళసూత్రం కట్టలేదు. మంగళసూత్రం కట్టనంతవరకు ఆమె పరస్త్రీయే. ఇలాంటి పవిత్రమైన ఆదర్శాన్ని జగత్తుకు అందించినవాడు రామచంద్రుడు. అతని సోదరులు కూడా అటువంటివారే! సీతారామలక్ష్మణులు ముగ్గురూ కలసి అరణ్యంలో 14 సంవత్సరములు జీవించారు. కాని, ఏనాడూ సీతముఖము చూసి ఎఱుగడు లక్ష్మణుడు. సీతాన్వేషణ జరుపుతున్నప్పుడు సుగ్రీవుడు ఒక నగలమూటను తెచ్చి రామలక్ష్మణుల ముందు పెట్టాడు. రామునికి కూడా తన భార్య నగలు ఏవో తెలియదు. ''లక్ష్మణా! ఈ నగలు మీ వదినవేనా? చూడు'' అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు చెప్పాడు: ''అన్నా! ఈ కంఠహారములు ఎవరివో నాకు తెలియదు. ఈ కంకణములు ఎవరివో నాకు తెలియదు. కాని ఈ కాలిఅందెలు మాత్రం సీతమ్మవే.'' రాముడు, ''ఈ అందెలు మాత్రం నీకెట్లా తెలుసు?'' అని ప్రశ్నించగా లక్ష్మణుడు, ''అన్నా! ప్రతిదినము సీతమ్మకు నేను పాదాభివందనము చేసేవాడిని. ఆ సమయంలో వీటిని చూశాను'' అన్నాడు. ఈవిధమైన శీలమును పోషించుకుంటూ రావడంచేతనే ఈనాటికీ మన ప్రాచీనులు ఆదర్శపురుషులుగా పూజింపబడుతున్నారు.

### లవకుశుల రామకథాసంకీర్తన

వాల్మీకి రామాయణమును వ్రాశాడు. ఒకనాడు దానిని ముందర పెట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు. ''నేనింతటి పవిత్రమైన చరిత్ర వ్రాశాను. ఇది సార్థకం కావాలంటే ప్రచార ప్రబోధలు అత్యవసరం. ఎవరు దీనిని ప్రచారం చేయగలరు?'' అని యోచిస్తూ ఉండగా అదే సమయానికి లవకుశులు పరుగెత్తి వచ్చారు. ''గురూజీ! మీరేదో యోచిస్తున్నట్లున్నారే!'' అన్నారు. వాల్మీకి, ''లవకుశులారా! నేను పవిత్రమైన రామచరిత్రను రచించాను. దీనిని సమాజానికి పంచిపెట్టాలి. దీనికి తగినవారు ఎవరా అని యోచిస్తున్నాను'' అన్నాడు. లవకుశులు చేతులు కట్టుకొని, ''గురూజీ! ఈ సేవకు మేము మా జీవితాన్నే అంకితం చేయడానికి సిద్ధంగా ఉన్నాము. మీరు ఆజ్ఞాపించండి, మేము ప్రచారం చేస్తాము'' అన్నారు. లేత హృదయులైన ఈ పిల్లలలో ఇంతటి త్యాగమా! ఇంతటి ఔదార్యమా! ఇంతటి పవిత్ర భావమా! అని ఆనందబాష్పాలు రాల్చాడు వాల్మీకి. ''ఈ ప్రపంచము సర్వసుఖములతో కూడిన బంగారు పాత్రవలె కనిపిస్తున్నది. కాని దీని నిండా ఉన్నది విషమే. విషముతో నిండిన బంగారు పాత్రకంటే అమృతముతో నిండిన మట్టిపాత్రయే మేలు. కాబట్టి మట్టిపాత్రయైనా మానవదేహము చాల పవిత్రమైనది. ఇందులో భగవంతుడు హృదయస్థాయిగా ఉన్నాడు. ఇట్టి భగవంతుని గూర్చి ప్రచారం చేయడానికి బిడియ మెందుకు? కనుక మీరు క్షణమైనా ఆలస్యం చేయనక్కరలేదు, త్యాగభావంతో వెళ్ళండి'' అన్నాడు. నిమిషంలో లవకుశులు లోపలికి వెళ్ళి కాషాయవస్త్రములను ధరించి, రుద్రాక్షలు కంకణములుగా చుట్టుకొని, తంబూర చేత పట్టుకొని బయలుదేరారు. ''రామకథను వినరయ్యా!'' అని బజారులవెంట తిరుగుతూ రామచరితమును ప్రచారం చేయసాగారు. ఈనాటి యువకులకు మాత్రం పబ్లిక్‌లో రెండు చేతులు జోడించి నమస్కారము చేయాలంటే చాల అవమానంగా ఉంటుంది. నగర సంకీర్తనకు పోవాలంటే తలలు దాచుకొని పోతుంటారు. నొసట విభూతి ఇంట్లో మాత్రం పెట్టుకుంటారు, బయటకు వస్తూనే తుడిచి వేసుకుంటారు. ఇదెంత విచిత్రమైన జీవితం! ఎంత దుర్బలమైన జీవితం! మంచికార్యమునకు ఎందుకు భయపడాలి? నీవు ఏ తప్పూ చేయటం లేదు కదా! భగవన్నామ స్మరణకు నీవు ఎందుకు భయపడాలి? మనం బలహీనులం కారాదు. ''నాయమాత్మా బలహీనేన లభ్యః'', బలహీనులు ఏ చిన్న కార్యమునూ సాధించలేరు.

### దైవనామాన్ని చెప్పడానికి సిగ్గెందుకు!

మానవుడు దుర్మార్గమునకు, దురాలోచనలకు ముందంజ వేస్తున్నాడు, పవిత్రమైన దివ్యజీవితానికి వెనుకంజ వేస్తున్నాడు. ఇదే పెద్ద బలహీనత. తుచ్ఛమైన సినిమా పాటలు పాడతారే మీరు, దైవనామాన్ని పాడటంలో అవమాన మేమున్నది! బజార్లోకి పోయి ''డడడా డడడా డడాడడా.....'' అని అర్థరహితమైన పాటలు పాడే బదులు రామా! కృష్ణా! గోవిందా! అని భగవన్నామాన్ని గానం చేయరాదా? ఈనాడు అనేకమంది అర్థరహితమైన పాటలతో తమ జీవితాన్ని వ్యర్థం

చేసుకుంటున్నారు. ఇది మానవత్వానికే అవమానకరం. కనుక యువకులారా! మీరు మానవులు, దైవము యొక్క బిడ్డలు, దైవము యొక్క ప్రతిబింబములు. ''మీరంతా నా అంశమే, నా స్వరూపమే'' అని భగవంతుడు చెబుతున్నాడు. అలాంటి మీరు పరులకు ఎందుకు భయపడాలి? దైవనామాన్ని చెప్పడానికి ఎందుకు సిగ్గుపడాలి? దైవము యొక్క చరిత్రను బోధించడానికి ఎందుకు వెనుకంజ వేయాలి? అధైర్యానికి చోటీయవద్దు, ధైర్యంగా దైవసేవలో పాల్గొనండి. మీరు పవిత్రులగుటయేగాక తోటివారిని కూడా పవిత్రులను గావించండి. ఎక్కడికి పోతున్నావని ఎవరైనా అడిగితే కొందరు తిరుపతికో, పుట్టపర్తికో పోతున్నామని చెప్పటానికి సిగ్గుపడి, ''బెంగుళూరుకు పోతున్నామండీ'' అంటారు. ఎంత బలహీనులు వీరు! చిన్నవిషయానికి ఎందుకింత అబద్ధమాడాలి? ''నేను పుట్టపర్తికి పోతున్నాను, స్వామిని దర్శించడానికి వెళుతున్నాను'' అని చెప్పడంలో అవమాన మేమున్నది! ధైర్యంగా దైవసేవలో మీరు పాల్గొనాలి.

### గ్రామసేవ ఎలా చేయాలి?

కొంతమంది యువకులు గ్రామసేవ చేస్తున్నారు. సేవ చేయడం చాల గొప్పతనం. తపస్సు చేయకపోయినా ఫరవాలేదు, తీర్థయాత్రలు చేయకపోయినా ఫరవాలేదు, సేవలు చేయండి. సేవకత్వమునందే నాయకత్వము ఇమిడియున్నది. సేవలు సల్పినవానికే శాంతి చేకూరుతుంది, అహంకారము నిర్మూలమవుతుంది. ఈనాడు గ్రామాలలో అపరిశుభ్రత పెరిగి పోయింది. సరియైన ఆహారము, సరియైన నీరు లేకపోవడంచేత ప్రజలు అనేక రోగాలకు గురి అవుతున్నారు. మొట్టమొదట అలాంటి గ్రామాలలో ప్రవేశించి సేవ చేయాలి. అయితే ప్రతివారము మీరు అదే గ్రామానికి పోనక్కరలేదు. ఉద్యోగం చేసేవారు ఊరికే లీవు తీసుకుంటే ఉద్యోగం ఊడిపోతుంది. సేవలు చేయడంలో మీకు ధనం కూడా వ్యయమవుతుంది. కనుక మీరు ఏదైనా గ్రామానికి వెళ్ళినప్పుడు ఆ గ్రామంలోని యువకులను ప్రోగు చేసి, ''అయ్యా! మీ గ్రామాన్ని మీరు శుభ్రం చేసుకోకపోతే ఇంకెవరు చేస్తారు?'' అని చక్కగా బోధించాలి. గ్రామములోని యువకులు ప్రతివారము మీటింగు పెట్టుకొని తమ గ్రామంలో సేవలు చేసుకోవడానికి తగిన కృషి సల్పాలి. ఎక్కడో హైదరాబాద్ నుండి నెల్లూరుకు పోవడమంటే ఎంత కష్టము! నెల్లూరు యువకులకే ట్రైనింగ్ ఇవ్వాలి, ఏ గ్రామానికి పోతే ఆ గ్రామంలోని యువకులకు తగిన బోధలు సల్పి వారితోనే సేవలు చేయించాలి. అప్పుడు మీకు ధనమూ వ్యయం కాదు, కాలము కూడా వ్యర్థం కాదు.

ఆరోగ్యమే మహాభాగ్యము. ఆరోగ్యములేక ఏ పనీ చేయలేము. కనుక మీరు గ్రామాలలో ఆరోగ్యానికి సంబంధించిన క్యాంపులను నిర్వహించాలి. ఒకరిద్దరు డాక్టర్లను తీసుకుపోయి వారిచేత రోగులను చెకప్ (పరీక్ష) చేయించాలి. ఈవిధంగా యువకులైనవారు సర్వసంగపరిత్యాగులై పల్లెలలో ప్రవేశించి సేవలు చేస్తున్నారంటే పల్లెవారు తమ సోమరితనానికి సిగ్గుపడి తాము కూడా ఇందులో పాల్గొంటారు. మీరు ఎప్పుడూ సేవకులుగా ఉండాలి. సేవకత్వంలోనే నాయకత్వం ఇమిడి యున్నది. ఈనాటి నాయకులు ఏనాడూ సేవలు చేసినవారు కాదు, సేవలు చేయకనే నాయకత్వము కావాలని ఆశిస్తున్నారు. అందువల్లనే ఈనాడు లోకానికి ఈగతి పట్టింది.

### దైవానికి దాసులైతే మీకే గౌరవం!

హనుమంతుడు ఎట్టివాడో మీకు తెలుసునా? శాంతుడు, గుణవంతుడు, బలవంతుడు హనుమంతుడు. అతడు సీతాన్వేషణ నిమిత్తమై అశోకవనంలో ప్రవేశించినప్పుడు ఏదో క్రొత్తరకమైన జంతువు వచ్చిందని అందరూ బయలుదేరారు చూడటానికి. లంకలోని రాక్షసులు ఏనాడూ కోతిముఖము చూసి ఎఱుగరు. ఇంద్రజిత్ వచ్చి, ''ఎవరు నీవు? '' అని ప్రశ్నించాడు. ''దాసోహం కోసలేంద్రస్య'', ''అయ్యా! నేను శ్రీరామచంద్రుని దాసుడను'' అన్నాడు. మీరు దైవానికి దాసులమనుకుంటే మీకే గౌరవంకాని ఇంకొకరికి కాదు. దుష్కర్మలకు, దురాలోచనలకు, విషయభోగములకు దాసులయ్యే బదులు దైవానికి దాసులు కావడంలో తప్పేమిటి? ''నేను ఎందుకోసం భయపడాలి? సమాజసేవ చేయడంలో తప్పేమున్నది!'' ఈవిధమైన విచారణతో మీలో మీరు ధైర్యసాహసములను అభివృద్ధి పర్చుకోవాలి. ఈవిధంగా మీరు సేవలో పాల్గొన్నప్పుడు దైవము మీ వెంటనే ఉంటాడు.

## నోరు మూయాలి, హృదయం తెరవాలి

మీరు వేరే సాధనలేమీ చేయనక్కరలేదు. సమయం చిక్కితే జపము, ధ్యానము అన్నీ చేయండి. అయితే ఈ ఆధునిక యుగంలో జపము, ధ్యానము కుదరటమే కష్టము. కొంతమంది మెడిటేషన్ చేయాలని ఫోటోకోసం మంచి ఫోజు పెట్టినట్లుగా కూర్చుంటారు. కాని, మైండ్ మాత్రం మార్కెట్‌లో తిరుగుతుంటుంది. ఇటువంటి ధ్యానము మీకు అక్కరలేదు. నోరు మూయాలి, హృదయం తెరవాలి. అదే నిజమైన ధ్యానము. ఈనాడు అనేకమంది హృదయాన్ని మూసిపెడుతున్నారు, నోరు తెరుస్తున్నారు. ఇది ధ్యానమే కాదు. కొందరు చేతిలో జపమాల త్రిప్పుతుంటారుకాని వారి మైండ్ మంగలింటికి, చాకలింటికి ప్రయాణమౌతుంది. ఈవిధంగా కాలాన్ని వ్యర్థం చేయకండి. జపము, ధ్యానము చేయడానికి మీకు కుదరకపోతే సేవ చేయండి.

## "సర్వకర్మ భగవత్ప్రీత్యర్థం"

దైవమును ఏరీతిగా ప్రార్థించాలి? అని కొంతమందికి సందేహము కల్గుతున్నది. నీవే దైవమైయుండగా తిరిగి దైవాన్ని ప్రార్థించడ మేమిటి? అయితే నేనే దైవమనే సత్యాన్ని గుర్తించేంతవరకు నీవు కొన్ని రకములైన సత్కర్మలను ఆచరించాలి. ప్రతి కర్మను భగవంతునికి అర్పితము గావిస్తున్నాననే భావముతో చేయాలి. దీనినే భారతీయులు, "సర్వకర్మ భగవత్ప్రీత్యర్థం" అన్నారు. ఏది చేసినా అది భగవత్కర్మగా భావించాలి. అయితే ప్రారంభంలో ఇది కొంత శ్రమనిపించవచ్చు, కొన్ని బాధలు కలుగవచ్చు. కాని క్రమక్రమేణ అదే సాధనగా రూపొందుతుంది. భగవద్గీతయందు చెప్పినట్లుగా దేనికైనా అభ్యాసం అత్యవసరం. ఈటింగ్, టాకింగ్, రీడింగ్, రైటింగ్ అన్నీ అభ్యాసముచేతనే అలవడుతాయి. అదేవిధంగా సేవకు కూడా అభ్యాసం కావాలి. భగవచ్చింతనకు కూడా అభ్యాసము కావాలి. మీ విద్యను, శక్తిసామర్థ్యములను భగవత్ప్రీత్యర్థం వినియోగించాలి.

## మీలో కావలసినంత శక్తి ఉన్నది

ఒక పిల్లవాడు, "స్వామీ! మాకు శక్తి నివ్వండి" అని ప్రార్థించాడు. ఏమి శక్తి కావాలి మీకు? సినిమా చూడటానికి శక్తి కావాలా? టీవీలు, వీడియోలు చూడటానికి శక్తి కావాలా?! శక్తి నివ్వండని ప్రార్థించడంలో అర్థం లేదు. మీలో కావలసినంత శక్తి ఉన్నది. కాని దానిని మీరు వేస్ట్ చేస్తున్నారు. వేస్ట్ (వ్యర్థం) చేయడమే మీకు టేస్ట్ (రుచి) గా ఉంటున్నది. ఇది చాల తప్పు. మీలోనున్న శక్తి ఇంక దేనిలోను లేదు. ప్రపంచంలో బంగారము, డైమండ్ అత్యంత విలువైనవని చెబుతారు. కాని సరియైన రీతిగా విచారణ చేస్తే మనిషికున్న విలువ దేనికీ లేదని స్పష్టమవుతుంది. Men are more valuable than all the wealth of the world. ప్రపంచంలోని సమస్త సంపదలకన్నా మనిషే అత్యంత విలువైనవాడు. బంగారాన్ని, వజ్రాలను కొనేది ఎవరు? మనిషే కదా! కొనేవాడు లేకపోతే కొనబడేదానికి విలువే లేదు. కనుక అన్నింటికన్నా మనిషే గొప్పవాడనే విశ్వాసాన్ని మీరు పెంచుకోవాలి. ఆ శక్తి మీలోనే ఉన్నదని గాఢంగా విశ్వసించాలి. దుర్లభమైన మానవజన్మ నెత్తినందులకు సత్కర్మలలో ప్రవేశించి సార్థకం గావించుకోవాలి.

## మనస్సు స్మరణకు, తనువు సేవకు

సేవలు చేయకుండా కేవలం రాం, రాం, రాం అని 'టేపు రికార్డరు' మాదిరి రామచింతన చేస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదు. సీతాన్వేషణ నిమిత్తమై హనుమంతుడు లంకలో ప్రవేశించినప్పుడు విభీషణుడు, "హనుమా! నీవెంత అదృష్టవంతుడివయ్యా! హాయిగా రామసన్నిధి చేరుకున్నావు. కాని నేనెన్నో సంవత్సరాలుగా రామచింతన చేస్తున్నప్పటికీ నాకింకా రామదర్శనము ప్రాప్తించలేదు" అని బాధపడ్డాడు. అప్పుడు హనుమంతుడు విభీషణునికి చక్కగా బుద్ధి చెప్పాడు. "విభీషణా! నీవు కేవలం రాం, రాం, రాం అని ఉచ్చరిస్తున్నావు కాని రామసేవలో ఏమైనా పాల్గొన్నావా? సీతమ్మవారు లంకకు వచ్చి పదినెలలైపోయింది. ఒక్కసారైనా ఆమెను చూశావా? ఆమె బంధవిమోచనకు ఏమైనా ప్రయత్నం చేశావా? రామకార్యంలో పాల్గొనకుండా ఊరికే రామనామాన్ని స్మరిస్తూ కూర్చుంటే రామతత్త్వాన్ని ఎట్లా పొందగలవు?" అన్నాడు. కనుక నామస్మరణతోపాటు సేవ కూడా చేయాలి. నామము –నెగటివ్, సేవ –పాజిటివ్ . ఈ రెండూ చేరినప్పుడే 'విల్–పవర్' (ఇచ్ఛాశక్తి) అనే కరెంటు ఏర్పడుతుంది.

## చూపును అదుపులో ఉంచుకోండి

యువకులారా! యువతులారా! తైలము దీపమును వెలిగిస్తుంది, భగవంతుని ప్రేమ జీవితాన్ని వెలిగిస్తుంది. చాలమంది దైవప్రేమను అర్థం చేసుకోలేక పోతున్నారు. దైవప్రేమకు హద్దులే లేవు. అది ఇట్లా ఉండాలి, అట్లా ఉండాలి అని శాసించే అధికారము ఎవ్వరికీ లేదు. కాని ప్రాకృతమైన ప్రేమకు కొన్ని పరిమితులుంటాయి. కనుక దానిని పరిమితమైన మార్గంలోనే ప్రవేశపెట్టాలి. ముఖ్యంగా మీరు మీ దృష్టిని అదుపులో నుంచుకోవాలి. మీరు వేరుగా భావించవచ్చుకాని ఈనాడు ఒక విషయాన్ని మీకు చెప్పవలసి వస్తున్నది. బయట కాలేజీలలో కో-ఎడ్యుకేషన్ ఉన్నది. స్త్రీపురుషులు లిరువురూ ఇంద్రియాలను నిగ్రహించుకున్నప్పుడు అందులో చెడు ఏమీ లేదు. కాని ఈనాటి యువతీ యువకుల ఇంద్రియాలు బ్రేకులు లేని కార్లమాదిరి ఉంటున్నాయి. కనుక కో-ఎడ్యుకేషన్ ఉన్నచోట మీరు చేరకూడదు. ఏదో ఒక సమయంలో ఒకరి దృష్టి మరొకరిపై ప్రసరిస్తుంది. మొట్టమొదట చూపుతో ప్రారంభమై నవ్వుతో అభివృద్ధి అవుతుంది. తరువాత మాట్లాడటంలో ప్రవేశిస్తారు. తరువాత 'లెటర్-రైటింగ్' ప్రారంభమవుతుంది. తరువాత 'ఫ్రెండ్‌షిప్' ఏర్పడుతుంది. చివరికి అది 'రిలేషన్‌షిప్'గా మారిపోతుంది. దీనికంతటికీ ఏది కారణం? చూపే కదా! అందువల్లనే సూరదాసు చెప్పాడు: ''కన్నులుండి గ్రుడ్డులై కళ్యాణకరమైన నీ రూపు దర్శింపనేరరైరి'', ''ఓ భగవంతుడా! అందరికీ కన్నులున్నాయి. కాని నిన్ను చూడగల్గుతున్నారా? సంకుచిత దృష్టితో ప్రాకృతమైన వికారములను చూస్తున్నారేకాని నిన్ను చూడలేక పోతున్నారు. అందరికీ చెవులున్నాయి. కాని అవి ఊరివారి సుద్దులను వింటున్నాయేకాని, దైవసంబంధమైన విషయాలను వినటానికి ప్రయత్నించటం లేదు'' అని ఆవేదన వ్యక్తం చేశాడు. జయదేవుడు కూడా నాలుకకు బుద్ధి చెప్పాడు. ''ఓ రసమెరిగిన నాలుకా! ఓ పవిత్రమైన నాలుకా! నీవు అసత్యమాడవద్దు, అధికంగా మాట్లాడవద్దు, చాడీలు చెప్పవద్దు, పరులను దూషించవద్దు. నీ సర్వపాపములూ పరిహారం కావాలంటే గోవిందా! దామోదరా! మాధవా! అని ఉచ్చరించు'' అని బోధించాడు.

## నగరసంకీర్తన ప్రభావం

తెల్లవారురఝామున నగర సంకీర్తన ఎందుకోసం పెట్టాము? పనిలేక పెట్టామా? లేక ప్రొద్దున్నే లేపి మీ నిద్ర పాడుచేయాలని పెట్టామా? కాదు, కాదు. ఇది భౌతికంగా, లౌకికంగా, ఆధ్యాత్మికంగా కూడా ఎంతో పవిత్రమైనది. మనస్సు రాత్రంతా నిద్రించి ప్రశాంతంగా ఉంటుంది. లేచిన తక్షణమే పిచ్చిపిచ్చి మాటలు వినకుండా బ్రహ్మముహూర్తకాలంలో, చల్లని వాతావరణములో రామా! కృష్ణా! గోవిందా! అని భగవన్నామాన్ని వింటూ ఉంటే హృదయానికెంతో హాయి కల్గుతుంది. పాడేవారికి హాయి, వినేవారికి హాయి! కనుక తెల్లవారి లేచిన తక్షణమే నామ స్మరణతో దినచర్యను ప్రారంభించాలి. సత్యసాయి సంస్థలలో నగర సంకీర్తన, భజన, సత్సంగము, స్టడీ-సర్కిల్ మున్నగువాటిని పెట్టడానికి కారణమేమిటి? కాలాన్ని సద్వినియోగ పరచి హృదయానికి శాంతి చేకూర్చడానికి. అసలు శాంతి అనేది ఎక్కడుంది? భౌతికంగా చూస్తే గాఢనిద్రలో శాంతి లభిస్తుంది. లేకపోతే సంకల్పరాహిత్యమైనప్పుడు శాంతి కల్గుతుంది. కాని సంకల్పములను అరికట్టుకొనుటకు వీలుకాదు. కనుక సాధ్యమైనంతవరకు దినములో కనీసం ఒక గంటసేపైనా మౌనం పాటించాలి. అతిగా మాట్లాడితే తలలోని నరాలన్నీ బలహీనమైపోతాయి. అవి పవిత్రమైన మాటలైతే మీ 'బ్యాటరీ' ఛార్జి అవుతుందిగాని, అపవిత్రమైన మాటలైతే మీ జీవితం అధోగతి పాలైపోతుంది. మితంగా మాట్లాడే పిల్లవాడు సమాజంలో సత్కీర్తిని పొందుతాడు. కొంతమంది ఊరికే వదవద వాగుతుంటారు. అలాంటివారిని చూస్తే, ''వస్తున్నాడురా వాయారి (వాగుడుకాయ)'' అని అందరూ తప్పించుకొని వెళ్ళిపోతారు. అతిభాష మతిహాని, మితభాష అతిహాయి.

## ఆడంబరాలకు పోకండి

మీరు సేవలలో ఎక్కువ ధనం వ్యయం చేయనక్కరలేదు. సాధ్యమైనంత వరకు డబ్బు తక్కువగా ఖర్చుపెట్టి సేవ అధికంగా చేయాలి. మీరు లక్షాధికారులు కావచ్చు, శ్రీమంతులు కావచ్చు. కాని, 'సింపుల్ లివింగ్, హై థింకింగ్' అలవర్చుకోవాలి. మీరు వేసే డ్రస్సులు కూడా సింపుల్‌గా ఉండాలి, ఆడంబరాలకు పోకూడదు. ఆడంబరానికి పోతే అహంకారము

బయలుదేరుతుంది. అయితే మీ దుస్తులు పరిశుద్ధమైనవిగాను, సమాజంలో అందరూ గౌరవించేటట్లుగాను ఉండాలి. దానితో పాటు మీ ప్రవర్తన కూడా పవిత్రమైనదిగా ఉండాలి. మీరు వేసుకున్న డ్రస్సు ఎంత తెల్లగా, ఎంత పరిశుద్ధంగా ఉంటుందో మీ హృదయం కూడా అంత పరిశుద్ధంగా ఉండాలి.

యువకులారా! మొట్టమొదట చెప్పినట్లుగా అన్నింటికీ మూలకారణం శీలమే. మీ ప్రవర్తన, మీ నడత చక్కగా ఉంటే చరిత్రలో మిమ్మల్ని మించినవారుండరు. మీరు పదిమంది కలిసి ఏదైనా గ్రామానికి వెళ్ళినప్పుడు అక్కడ ఎట్లా ఉండాలి? నిశ్శబ్దంగా, ప్రశాంతంగా, చిరునవ్వుతో ఉండాలి. అంతేగాని మిగిలిన వారికి అశాంతి కలిగేటట్లు గట్టిగా మాట్లాడుకుంటూ, హ్హాహ్హాహ్హా అని గట్టిగా నవ్వుకుంటూ పోకూడదు. అలాంటివారిని చూస్తే, ''ఏమిరా, ఏదో రౌడీ గ్యాంగ్ వస్తోందే'' అని గ్రామస్థులు భయపడి పోతారు. మీరు అలాంటి చెడ్డ పేరు తెచ్చుకోకూడదు. వినయంగా వెళ్ళండి, పనిలో ప్రవేశించండి. పనిలో ప్రవేశిస్తే మాటలకు అవకాశముండదు. మాట్లాడేవాడు పని చేయడు. పని చేసే వాడు మాట్లాడడు. ఈ సత్యాన్ని మీరు జ్ఞాపకం పెట్టుకోండి.

### వర్తమానమే ప్రధానం

ఈనాటి నుండి మీ జీవితంలో క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించండి. జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఎంత ప్రయత్నించినా అది తిరిగి రాదు. అట్లే భవిష్యత్తును కూడా చింతించకండి. ఎందుకంటే అది మీ చేతిలో లేదు. ప్రెజెంట్ (వర్తమానం) చాల ప్రధానమైనది. ఇది ఆర్డినరీ ప్రెజెంట్ కాదు, ఆమ్నిప్రెజెంట్! అనగా గడచినది, గడుపబోవునది రెండూ వర్తమానంలోనే ఇమిడియున్నాయి. 'పాస్ట్' అనే వృక్షము నుండి వచ్చినదే 'ప్రెజెంట్' అనే విత్తనము. ''ప్రెజెంట్'' అనే విత్తనము నుండి ఆవిర్భవించునదే ''ఫ్యూచర్'' అనే వృక్షము. కనుక ప్రెజెంటే చాల ప్రధానమైనది. నీకు ఆకలైనప్పుడు నీ తట్టలోనున్న అన్నం భుజించాలికాని, పదినెలల క్రిందట నేను పంచభక్ష్యపరమాన్నములను భుజించానని తలుచుకొంటే ప్రయోజన మేమిటి? వర్తమానంలో మీరు తగు జాగ్రత్తలు తీసుకుంటే మీ ఫ్యూచర్ కూడా ఆటోమేటిక్‌గా మంచిగానే ఉంటుంది. అంతేగాని ఊరికే నా భవిష్యత్తు ఎలా ఉంద్తో, ఏమవుతుందో అని చింతిస్తే నిజంగా దుఃఖమే కలుగుతుంది. కనుక చింతనే చేయకూడదు.

### కష్టమైనా, సుఖమైనా దైవప్రసాదంగా భావించండి

అసలు చింతకు రూపమేమిటి? అది మీకు మీరు సృష్టించుకున్నదే! ఎప్పుడు చూసినా ఆనందంగా ఉండాలి. ''అదెట్లా సాధ్యం స్వామీ? మా ఇంట్లో అనేక బాధలున్నాయి, సంసారంలో అనేక వ్యథలున్నాయి. ఇంక మేమెట్లా సుఖంగా ఉండటానికి వీలవుతుంది?'' అని మీరడుగవచ్చు. అయితే చింత చేస్తే ప్రాబ్లమ్స్ పోతున్నాయా? పోవటం లేదే! ఇంక చింత చేసి ఏమి ప్రయోజనం? కనుక హేపీగా ఉండండి. అదే మీ చింతని దూరం చేస్తుంది. అంతేగాని ఏవో కష్టాలు వచ్చాయని చింత చేస్తే అదింకా అధికమైపోతుంది. ఏది వచ్చినా భగవత్ప్రసాదంగా స్వీకరించాలి. కష్టాలు కూడా భగవత్ప్రసాదమే. రెండు కష్టాలమధ్యలోనే ఒక సుఖముంటుంది. కష్టము లేక సుఖము యొక్క విలువ తెలియదు. మలేరియా జ్వరం వచ్చినవానికి చేదుగా ఉండే క్వినైన్ మందు ఇస్తారు. దానిని కష్టపడి త్రాగినప్పుడే జ్వరము నివారణ అవుతుంది. అట్లే కష్టము కూడా సుఖమునే అందిస్తుంది. కనుక ఎప్పుడూ మీరు ఆనందంగా ఉండాలి.

### నాస్తికులను ధైర్యంగా ఎదుర్కోండి

యువకులారా! దేహసంబంధమైన, కుటుంబ సంబంధమైన విషయాలకు మీరు హృదయంలో ఏమాత్రము చోటివ్వకండి. హృదయంలో చోటివ్వవలసింది భగవంతుడొక్కనికే! అయితే సమాజంలో కొంతమంది నాస్తికులుంటారు కదా! వారు మిమ్ములను గేలి చేయవచ్చు. ''ఒరేయ్! ఇంత చదువుకున్నావు. టౌన్‌లో పుట్టిపెరిగావు. నీవు కూడా పల్లెలవారివలె దేవుడు, భజన అని మాట్లాడతావేమిటి?'' అని విమర్శించవచ్చు. ఈ ఆధునిక యుగంలో దైవాన్ని చింతించకూడదంటారు. ఇంక దేనిని చింతించాలి? దయ్యాన్ని చింతించాలా? కాదు, కాదు, దైవాన్నే చింతించాలి. మీ విశ్వాసం గాఢంగా ఉండాలి. ''అయ్యా! దేవుడు లేడని చెబుతున్నావు. నీకు లేడుకాని నాకున్నాడు. నా దేవుడు లేడని చెప్పడానికి

నీవెవరు? నీకు లేకపోతే పోనీ, నాకున్నాడు'' అని ధైర్యంగా ఎదుర్కోవాలి. అంతేగాని మీకున్నదానిని ఎవరో వచ్చి లేదంటే మీరెందుకు విశ్వసించాలి? ఎవడో వచ్చి మీకు అమ్మ లేదంటే మీరు ఏడుస్తూ కూర్చుంటారా? ''నీవు వట్టి అమాయకుడవు, నా తల్లి నా ఇంట్లో ఉన్నది'' అని ధైర్యంగా ఎలా చెప్పుకుంటారో అదేరీతిగా, ''నాకు దేవుడున్నాడు, నా హృదయంలోనే ఉన్నాడు'' అని నాస్తికులతో ధైర్యంగా వాదించాలి. వారిని మీ మార్గంలో ప్రవేశపెట్టుకోవాలికాని, మీరు వారి మార్గంలో ప్రవేశించకూడదు. వారు చెప్పినదానిని గ్రుడ్డిగా నమ్మి అనుసరిస్తే మీరు వారికి బానిసలైపోతారు. అందరూ మిమ్మల్నే అనుసరించాలి. ఎందుకంటే మీరు దైవత్వంతో కూడియున్నారు. దైవత్వంతో కూడినవారికి జగత్తే వశమవుతుంది. ఇట్టి ధైర్యసాహసములను మీరు పెంచుకోవాలి. అంతేగాని ఎవరో వచ్చి ఏమో అన్నారని ఊరకే ఏడుస్తూ కూర్చోకూడదు.

## కష్టాలు, నష్టాలు కదిలిపోయే మేఘాలు

నయనములనగా కన్నులు, నారమనగా నీరు. కనుక నయనముల నుండి పుట్టే నారమును నారాయణునికోసమే వదలాలికాని, లౌకిక విషయాలకోసం కాదు. కన్నుల నుండి ఆనందబాష్పములనే రాల్చాలికాని, శోకబాష్పములను కాదు. దేనికీ మీరు ఏడ్వకూడదు. ఏవో కష్టాలు, నష్టాలు వస్తుంటాయి. పోతుంటాయి. అన్నీ కదిలిపోయే మేఘాలే! ఈ సత్యాన్ని గుర్తించుకుంటే మీరు విచారానికి ఏమాత్రము అవకాశ మందించరు. చలించని మనస్సును, భ్రమించని దృష్టిని అలవర్చుకోవాలి. యువతీయువకులారా! ఈ ప్రపంచంలో ఎంతోమంది యువతీయువకులున్నప్పటికీ మీరు మాత్రమే ప్రశాంతి నిలయం చేరారంటే ఎంత అదృష్టవంతులో మీరు! ఈ ప్రాప్తిని మీరు వ్యర్థం చేసుకోకండి. మీరు ఎక్కడకు పోయినా నేను మీవెంట ఉన్నాను. మీకు ఏవిధమైన బాధలు వచ్చినా నేను చూసుకుంటాను. ధైర్యంతో, దైవభావంతో మీరు సేవలలో పాల్గొనండి. నష్టములనైనా సహించుకోండికాని సేవలను మాత్రం మానకండి. కష్టనష్టములకు ఏమాత్రము వెఱువకండి.

## దైవశక్తిని శంకించకండి

త్యాగరాజు మహాభక్తుడు. కానీ అతడు కూడా ఒక పర్యాయం కష్టాలను భరించుకోలేక రాముని నిందిస్తూవచ్చాడు. ''రామా! నేనిన్ని కష్టాలు పడుతుంటే నీవు చూస్తూ ఊరకుంటున్నావేమిటి? ఈ కష్టాలను నివారణ చేసే శక్తి నీకు లేదా? లేక నీ హృదయాన్ని కరిగించే భక్తి నాకు లేదా? నాకు భక్తి ఉందికాని, నీకే శక్తి లేదు'' అన్నాడు. తక్షణమే అజ్ఞానము నుండి మేలుకున్నాడు.

''కపి వారిధి దాటునా?
లక్ష్మీదేవి వలచునా?
లక్ష్మణుండు కొలచునా?
సూక్ష్మబుద్ధిగల భరతుడు చూసిచూసి మ్రొక్కునా?
అబ్బ! రామశక్తి ఎంతో గొప్పరా!''

''రామా! నీశక్తి ఇంతది, అంతది కాదు, ఎంతో గొప్పది. నా బుద్ధి చాల చిన్నది కావడంచేతనే నిన్ను నిందించాను. ఇది నా తప్పే!'' అని లెంపలేసుకున్నాడు. మీకు కూడా ఇలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు దైవాన్ని నిందించకండి, దైవాన్ని విమర్శించకండి. మీతో ఆడుతూ పాడుతూ ఉన్నంతమాత్రమున దైవాన్ని సామాన్యమానవునిగా భావించకండి. మిమ్మల్ని మీరు విమర్శించుకోండి, మీ దోషాలను మీరు చూసుకోండి. అప్పుడే మీరు బాగుపడతారు. ఏవో గొప్ప విద్యలు నేర్చామనీ, గొప్ప ఉద్యోగాలు చేస్తున్నామనీ విఱ్ఱవీగితే లాభం లేదు. మీరు నేర్చిన విద్యలు గొప్పవి కాదు. మీరు నేర్వవలసిన విద్య ఆధ్యాత్మిక విద్యయే! ఆ విద్యను నేర్చుకుంటే సమస్తవిద్యలూ మీ హస్తగతమౌతాయి. భగవంతుని ప్రేమను సాధించడానికి మీరు ప్రయత్నించాలి. ఆ ప్రేమయే సర్వమునకు మూలాధారము.

విద్యార్థులారా! యువకులారా! యువతులారా!

ఈ నాలుగు దినములూ మీరు ప్రశాంతినిలయంలో నేర్చుకున్న విషయాలను నిరంతరము మననం చేసుకుంటూ తద్ద్వారా మీ భక్తిప్రపత్తులను, సేవను అభివృద్ధి గావించుకుంటూ జీవితాన్ని సార్థకం చేసుకోండి. కేవలం ఇక్కడ మాత్రమే భక్తిప్రపత్తులను ప్రదర్శిస్తే ప్రయోజనం లేదు. ఎక్కడ పోయినా ఈ భక్తి ప్రపత్తులు మీ నీడవలె మీ వెంటనే ఉండాలి. ''ప్రశాంతినిలయంలో స్వామి ఈ విధంగా చెప్పాడు'' అని అప్పుడప్పుడు మననం చేసుకోండి, మీలో మీరు మాట్లాడుకోండి. పశువులు పచ్చని గడ్డి కనిపిస్తే గబగబా

తినేస్తాయి. కాని తమ స్వస్థానం చేరిన తరువాత తీరికగా నెమరు వేసి చక్కగా జీర్ణించుకుంటాయి. అదేరీతిగా ఇక్కడ మీరు అనేక విషయాలను త్వరత్వరగా విన్నారు. తిరిగి మీ స్వస్థానం చేరిన తరువాత వీటిని మననం చేసుకొని జీర్ణించుకోవాలి. అప్పుడే మీరు భుజించిన ఈ 'ఆహారము' మీకు పుష్టి నిస్తుంది. ఈ పుష్టియే సంతుష్టి నందిస్తుంది. కనుక మీరు దేనికీ సందేహించనక్కర లేదు. దైవవిశ్వాసాన్ని పెంచుకోండి, సేవను అభివృద్ధి పర్చుకోండి. మీతోపాటు ఇంకా పదిమందిని చేర్చుకోండి. ఈ సేవలో ఒక్కొక్కవ్యక్తి నూరుమంది చొప్పున పెంచుకుంటూ పోతే దేశం ఎంతో బాగుపడుతుంది.

### ముందు తల్లిదండ్రులను సంతోషపెట్టండి

యువకులారా! నిత్యమూ మీకు చాల శ్రమ నందిస్తున్నానేమో! కాని మీకోసం నేనెన్ని శ్రమలైనా పడతాను. మీరు బాగుపడితే చాలు. మీరు బాగుపడి సమాజాన్ని బాగుపర్చితే అదే నాకు ఆనందము. పల్లెలలో సేవ చేయడానికని వెళ్ళినప్పుడు అమితంగా ఖర్చు చేసి శ్రమ పడకండి. కొద్దికొద్దిగా ఆ పల్లెలవారితోనే పనులు చేయించండి. వారికి ఈ సంస్థల విషయాన్ని విశదీకరించి వారి తోనే పల్లెను అభివృద్ధి గావించడానికి పూనుకోండి. అయితే ఈ సేవ పేరుతో మీ ఇంట్లోవారిని మాత్రం కష్టపెట్టకండి. మొదట తల్లిదండ్రులను సంతోషపెట్టి తరువాత నే సేవలో ప్రవేశించండి. కొంతమంది పిల్లలు, ''స్వామీ! మా తల్లిదండ్రులు మమ్మల్ని సేవకు పంపరు'' అని చెబుతారు. అలాంటివారు ముందు తమ తల్లిదండ్రులకు సేవ గురించి చక్కగా అర్థమయ్యేటట్లు చెప్పాలి. ''నాన్నా! ఈ దేహము వచ్చింది తిని కూర్చోవటానికి కాదు. 'పరోపకారార్థమిదం శరీరం'. పదిమందికి సేవ చేయాలి'' అని చక్కగా చెబితే తల్లిదండ్రులు కూడా బుద్ధి తెచ్చుకుంటారు. మంచిమాటలతో వివరిస్తే తల్లిదండ్రులు కూడా అర్థం చేసుకుంటారు. లేకపోతే మీరు సేవ పేరుతో పదిమందితో కలిసి గ్యాంగ్ మాదిరి పోయి ఎక్కడ ఏమి చేస్తున్నారో అని అనుమానిస్తారు. కాబట్టి మీరు వారికి చెప్పినట్లుగా మంచిగా ప్రవర్తించండి. తండ్రికి పుత్రుడు పుట్టగానే ఆనందము పుట్టదు, ఆ పుత్రుడు సమాజంలో మంచిపేరు తెచ్చుకున్నప్పుడే ఆనందము కల్గుతుంది.

### మంచిపనులతో మంచిపేరుతో మంచిగా జీవించండి!

మంచిపేరు తెచ్చుకోండి, మంచి పనులు చేయండి, మంచిగా ఉండండి, మంచిగా జీవించండి. ఇదే స్వామి యొక్క ఆశయము. గడచిన నాల్గుదినములలో మంచిగా ఉన్నారు, మంచిగా ప్రవర్తించారు. అయితే కొన్నికొన్ని విషయాలలో Emotionను, Excitementను కంట్రోలు చేసుకోవాలి. మాటలను తగ్గించుకోండి, పవిత్రతను పెంచుకోండి, ఆనందంగా జీవించండి. Be happy. జీవితంలో శాశ్వతమైన హేపీనెస్ లేనే లేదు. అప్పటికప్పుడు వస్తుంది, పోతుంది. ఒక్క దైవత్వంతో మాత్రమే శాశ్వతమైన హేపీనెస్ ఉంటున్నది. కనుక మీరు దైవత్వంతో 'హార్ట్ టు హార్ట్, లవ్ టు లవ్' సంబంధాన్ని పెంచుకోండి. ఇదే నిజమైన భక్తిప్రపత్తులకు నిదర్శనం. స్వామి ఆశీర్వాదములు మీపై అమితంగా ఉంటున్నాయి. మీరు సుఖశాంతులతో, భక్తిప్రపత్తులతో ఆనందంగా జీవించి దేశానికి సరియైన సేవలు చేయాలని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

*(తేది : 19-7-1997 మధ్యాహ్నం మూడుగంటలకు పూర్ణచంద్ర సభామండపంలో శ్రీసత్యసాయి ప్రథమ ప్రపంచ యువజన సమ్మేళనంలో పాల్గొన్న డెలిగేట్లకు శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*



# సత్యోపనిషత్

(గత సంచిక తరువాయి)

50. స్వామీ! భక్తి కలగాలంటే నమ్మకం ప్రధానం కదా! మరి నమ్మకం రావాలంటే మార్గమేమిటి?

బాబా: ఇది చాల తెలివితక్కువ ప్రశ్న. నమ్మకం రావడమేమిటి? ఇది అంగడిలో అమ్మేది కాదు. ఒకరు ఇచ్చేది కాదు, పుచ్చుకునేది కాదు. ఇది నీలో ఉన్న సహజ గుణమే! విశ్వాసమే నీ శ్వాస. అది లేనప్పుడు నీకు శ్వాస లేనట్లే! విశ్వాసం కలగాలంటే ఏమి చెయ్యాలి? అని అడిగావు. ఒక్కసారి యోచించుకో - నీకు విశ్వాసం ఉందా లేదా అని. అప్పుడు నీకే సులభంగా అర్థమవుతుంది. ఉదాహరణకి నీ బట్టలను చాకలికి వేశావు. అతడు వాటిని ఉతికి ఇస్త్రీ చేసి తిరిగి తెస్తాడన్న నమ్మకంతోనే వేశావు కదా! వాటిని తీసుకొని వాడు పారిపోతాడనుకుంటే వేస్తావా? కంసాలి చక్కని నగ చేసిస్తాడన్న నమ్మకంతోనే అతని చేతిలో బంగారం పెడతావు. అతడు పారిపోతాడనుకుంటే అతని చేతికి బంగారం ఇవ్వవు కదా! క్షురకర్మకు మంగలి దగ్గరకు వెళ్ళావు నీవు వాడు చక్కగా క్రాపు చేస్తాడని వాడి ముందు తలవంచావా? లేక మెడ మీద కత్తి పెడతాడేమో అనుకుంటూనా? డాక్టరు వద్దకు వెళ్ళి ఆపరేషన్ బల్లపై పడుకున్నావు. తిరిగి క్షేమంగా ఇంటికి వస్తానని పడుకున్నావా? లేక ప్రాణం పోతుందనుకుంటూనా? మార్కెట్‌కు వెళ్ళావు. ఇంటికి తిరిగి వస్తాననే నమ్మకంతోనే కదా! ఆలోచించు. కనుక నీకు చాకలి, కంసాలి, మంగలి, డాక్టరు - వీరందరిపై నమ్మకముందికాని, భగవంతునిపై లేదు. ఇది చాల దురదృష్టం. కనుక విశ్వాస మనేది నీకు సహజం, అది లేకపోవడం అసహజం. భక్తివిశ్వాసాలు మనిషికి రెండు నేత్రాలవంటివి. రథానికి రెండు చక్రాలవలె, పక్షికి రెండు రెక్కలవలె మనిషికి భక్తివిశ్వాసాలుండాలి.

51. స్వామీ1 సద్గుణాలు పొందటం ఎలాగంటారు?

బాబా: ముందు నీకు సద్గుణాలు అవసరమని తెలియాలి. అవి నిన్ను ఎంత ఉన్నత స్థితిలో ఉంచుతాయో తెలియాలి. ఆ తరువాత నీకున్న దుర్గుణాలను గమనించాలి. ఏనాడైతే నీవు దుర్గుణాలను విడనాడతావో ఆనాడే సద్గుణాలతో నీ జీవితాన్ని నింపుకోవచ్చును. దీనికి ఒక చిన్న ఉదాహరణ. ఇది ఒక టంబ్లరు. ఈ టంబ్లరులో నీరు ఉంది. ఇప్పుడు ఈ టంబ్లరును పాలతో నింపాలంటే ఏం చెయ్యాలి? ముందు టంబ్లరులోని నీళ్ళని పారబోయాలి. ఆ తరువాత నే పాలు టంబ్లరులో పోయడానికి వీలవుతుంది. నీళ్ళు ఉండగా పాలని పోయడానికి వీలుందా? లేదు. అదే ప్రకారం నీలో దుర్గుణాలున్నంత కాలం సుగుణాలు చేరడానికి వీలులేదు. ముందు వాటిని పోగొట్టుకో. ఆ తర్వాత సుగుణాలని చేర్చుకో. *Removal of immorality is immortality* అని తెలుసుకో.

(సశేషం)

# శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,

ప్రశాంతినిలయం - 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా

దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్ నెంబరు 0990001032

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్ నెంబరు. 2001198

## ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా

| వరుస నెంబరు | పేరు | ధర రూ.పై |
|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | 8-50 |
| 2. | గీతా వాహిని | 18-00 |
| 3. | ధర్మ వాహిని | 8-50 |
| 4. | ప్రశాంతి వాహిని | 11-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | 10-00 |
| 6. | భాగవత వాహిని | 18-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | 35-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | 18-00 |
| 9. | లీలాకైవల్య వాహిని | 4-50 |
| 10. | సత్యసాయి వాహిని | 14-00 |
| 11. | జ్ఞాన వాహిని | 11-00 |
| 12. | ధ్యాన వాహిని | 15-00 |
| 13. | ప్రేమ వాహిని | 9-00 |
| 14. | విద్యా వాహిని | 12-00 |
| 15. | సూత్ర వాహిని | 8-50 |
| 16. | సందేహ నివారిణి | 24.00 |
| 17. | అద్భుతమూర్తి | 37-00 |
| 18. | ఆత్మారామమ్ | 34-00 |
| 19. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | 18-00 |
| 20. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | 14-00 |
| 21. | భజనావళి | 27.50 |
| 22. | మనస్సు - మర్మము | 14-00 |
| 23. | చిన్నకథ (1వ భాగం) | 17-00 |
| 24. | చిన్నకథ (2వ భాగం) | 18-00 |
| 25. | చిన్నకథ (3వ భాగం) | 23-00 |
| 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | 40-00 |
| 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | 43-00 |
| 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | 38-00 |
| 29. | సత్యం శివం సుందరం (4వ భాగం) | 27-00 |
| 30. | మణిమాల | 20-00 |
| 31. | వచనామృతము | 18-50 |
| 32. | షిరిడి నుండి పుట్టపర్తి | 40-00 |
| 33. | యుగావతారీ సాయిశా | 25-00 |
| 34. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) | 27-00 |
| 35. | వాక్యవిభూతి | 6-00 |
| 36. | ప్రేమసుధా ప్రవంతి | 52-00 |
| 37. | శ్రీసత్యసాయిగీతామృతము | 46-00 |
| 38. | సాయిబాటలో నా పయనము | 55-50 |
| 39. | ప్రబోధ పంచామృతము | 15-00 |
| 40. | సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక | 25-00 |
| 41. | శ్రీసత్యసాయి గీతా | 30-00 |
| 42. | శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి | 28-00 |
| 43. | సత్యసాయి సమర్చన | 15-00 |
| 44. | భక్తోద్ధారక శ్రీసత్యసాయి | 28-00 |
| 45. | హృదయ పుష్పాలు | 15-00 |
| 46. | పుష్పాంజలి | 20-00 |
| 47. | మూఢమతి - ముక్తమతి | 23-50 |
| 48. | పర్తీశునితో పంచ దశాబ్దాలు | 27-00 |
| 49. | శ్రీసత్యసాయి దివ్య లీలామృతము | 15-00 |
| 50. | ప్రేమజ్యోతి | 45-00 |
| 51. | మాతృశ్రీ ఈశ్వరమ్మ | 44-00 |
| 52. | భక్తి రసాయనం | 18-00 |
| 53. | జయభేరి | 17-00 |
| 54. | శ్రీసత్యసాయి విన్నపములు | 17-00 |
| 55. | శ్రీసత్యసాయీశోపనిషత్ | 5-00 |
| 56. | బాబా జీవితమే జగతికి సందేశం | 65-00 |
| 57. | పూర్ణావతారి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా | 45-00 |
| 58. | నాలో నిండిన వెలుగు | 20-00 |
| 59. | శ్రీ సాయిరామ శతకం | 5-00 |
| 60. | శ్రీ సాయిరామ స్తుతిమాల | 3-00 |
| 61. | భగవాన్ శ్రీ సత్యసాయికి జన్మదిన కానుక | 5-00 |
| 62. | స్మృతి పథంలో శ్రీమతి ఈశ్వరమ్మ | 5-00 |
| 63. | శ్రీ సాయి మంజీరాలు | 10-00 |
| 64. | బృందావనంలో శ్రీ సాయిసన్నిధి | 10-00 |
| 65. | సుగుణానిధి శ్రీ సత్యసాయి | 5-00 |
| 66. | భగవాన్ శ్రీ సత్యసాయి పూజావిధానం | 6-00 |
| 67. | శ్రీ సత్యసాయి శిష్యవాణి | 5-00 |

ఆగష్టు 1997

**రూ॥లు 50-00 కాని ఆపైన విలువగల పుస్తకములు కొన్నవారికి ''సాయీశ్వరునికి అక్షర కుసుమ సమర్పణ'' అనే పుస్తకము ఉచితముగా ఇవ్వబడును.**

పుస్తకములు రమారమి ప్రపంచంలోని అన్నిభాషలలోను మా పుస్తకవిక్రయకేంద్రం, ప్రశాంతి నిలయము, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్‌లో దొరుకును. పుస్తకముల కేంద్రము శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లర్నింగ్, బృందావనము క్యాంపస్. పోష్టు కాడుగోడి, వైట్‌ఫీల్డ్, బెంగుళూరు - 560 007 కర్నాటక, ఇండియాలో కూడాదొరుకును.

మనదేశములో విదేశములనుండి పుస్తకములను కోరేవారికి సనాతనసారథి తెలుగు మాసపత్రికకు చందావివరములు పుస్తకములను రిజిష్టరీ చేసిన పోష్టులో లభ్యమైనటువంటివాటిని పంపబడును. పుస్తకములకోసం కోరికలు సొమ్మురుసుము పుస్తకములవెల, రిజిస్ట్రీ ఖర్చులు మనదేశములోని ఏస్థలానికైనా మనియార్డరుకాని, ఇండియన్ పోష్టల్ ఆర్డర్‌లోగాని ఎకౌంటు పేయీ చెక్కుల ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టుద్వారాగాని పంపవలెను.

**రుసుము పంపు విధానము** రుసుమును విదేశములనుండి పుస్తకములకై కోరికలు సనాతన సారథి కోసం వార్షిక చందాలు తెలుగు-ఇంగ్లీషు మాసపత్రికలకై విదేశపు నాణ్యములలోనే పంపాలి. దేశీయ రూపాయలలో పంపకూడదు. డబ్బును ఆ రూపములో పంపితే దానిని జప్తుచేయబడును. గవర్నమెంటువారి వల్ల అన్ని రుసుములు కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయమ్, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా, పిన్‌కోడ్ 515 134, స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా ప్రశాంతి నిలయమ్ బ్రాంచి (శాఖ) (కోడ్‌నెంబరు 2786) చిరునామా పూర్తిగాను, పెద్ద అక్షరాలలోను వ్రాసి, పుస్తకముల పేర్లు, సంఖ్య కోడ్ నెం. స్పష్టముగా వ్రాయవలెను.
పుస్తకములు చేరు వ్యవధి. సాధారణముగా పోష్టు డిపార్టుమెంటువారు ఈ క్రింది విధముగా బట్వాడా వ్యవధి తీసుకుంటారు.

మాసిక సనాతన సారథిని ప్రతినెల 30వ తేదిన పంపబడును. పోస్టేజి (మనదేశములో) ప్రతి 100 గ్రాములకు 50 పైసలు చొప్పున రిజిస్ట్రేషన్ చార్జీలు రూ 10.00లు కలుపుకొని పుస్తకములకై ఆర్డరు ఒకకేజీ పార్శిలు (రమారమి 3 నుండి 5 పుస్తకాలు) పోష్టు ఖర్చులు రూ.5.00లు రిజిస్ట్రేషన్ ఛార్జీలు రూ 10.00 మొత్తము రూ 15.00 2 కేజీల పార్శిలు (రమారమి 4 నుండి 8 పుస్తకములు) పోష్టు ఖర్చులు, రిజిస్ట్రేషను కలిపి రూ.20.00లు; 3కేజీలు పార్శిలు (రమారమి 7 నుండి 10 పుస్తకాలు - పోష్టు; రిజిస్ట్రేషన్ ఖర్చులు - రూ. 25.00; 4 కేజీల బరువుగల పుస్తకాలకి (రమారమి 9 నుండి 15 పుస్తకాలుంటాయి - పోష్టు, రిజిస్ట్రేషన్ ఖర్చులు రూ.30.00లు, 5 కేజీల బరువుగల పుస్తకాలకి (రమారమి 14నుండి 20 పుస్తకాలుంటాయి) రిజిస్ట్రేషన్ ఖర్చులు రూ.35.00లు పుస్తకములను పంపగోరువారు దయచేసి పుస్తకముల వెల, పోష్టుఖర్చులు రిజిస్ట్రేషన్ ఖర్చులతో సహా చేర్చి పంపప్రార్థన. పోష్టుఖర్చులు (విదేశములకు) భారతీయ పోష్టల్ డిపార్టుమెంటు వారికే చెల్లించవలసి అతి తక్కువ ఛార్జీలు మీ ఏఇతర ఖర్చులు లేవు.
మాసిక సనాతన సారథిని ప్రతినెల 30వ తేదిన పంపబడును. పోస్టేజి (మనదేశములో) ప్రతి 100 గ్రాములకు 50 పైసలు చొప్పున రిజిస్ట్రేషన్ చార్జీలు రూ. 10.00లు కలుపుకొని పుస్తకములకై ఆర్డరు ఒకకేజీ పార్శిలు (రమారమి 3 నుండి 5 పుస్తకాలు) పోష్టు ఖర్చులు రూ.5.00లు రిజిస్ట్రేషన్ ఛార్జీలు రూ. 10.00 మొత్తము రూ 15.00 2 కేజీల పార్శిలు (రమారమి 4 నుండి 8 పుస్తకములు) పోష్టు ఖర్చులు, రిజిస్ట్రేషన్ కలిపి రూ.20.00లు; 3కేజీలు పార్శిలు (రమారమి 7 నుండి 10 పుస్తకాలు - పోష్టు; రిజిస్ట్రేషన్ ఖర్చులు - రూ. 25.00; 4 కేజీల బరువుగల పుస్తకాలకి (రమారమి 9 నుండి 15 పుస్తకాలుంటాయి - పోష్టు, రిజిస్ట్రేషన్ ఖర్చులు రూ.30.00లు. 5 కేజీల బరువుగల పుస్తకాలకి (రమారమి 14నుండి 20 పుస్తకాలుంటాయి) రిజిస్ట్రేషన్ ఖర్చులు రూ.35.00లు పుస్తకములను పంపగోరువారు దయచేసి పుస్తకముల వెల, పోష్టుఖర్చులు రిజిస్ట్రేషన్ ఖర్చులతో సహా చేర్చి పంపప్రార్థన. పోష్టుఖర్చులు (విదేశములకు) భారతీయ పోష్టల్ డిపార్టుమెంటు వారికే చెల్లించవలసి అతి తక్కువ ఛార్జీలు మరి ఏ ఇతర ఖర్చులు లేవు.

---

**రాబోవు పుస్తకములు 1. దీర్ఘశరణాగతి - శ్రీ సత్యసాయి వ్యాఖ్యాక్కరలు, 2. నాసాయి, 3. నామస్మరణ విశిష్టత, 4. శ్రీ సత్యసాయి స్తోత్రావళి, 5. శ్రీ సత్యసాయి పురాణం, 6. సాయిరాం 7. బృందావనంలో రామసుధా స్రవంతి 1996 వసంతకాలంలో (శ్రీ సత్యసాయి భగవానుడు అనుగ్రహించిన ప్రసంగాలు)**

